# బంగారు ముంగిస



"కరుణశ్రీ"
జంధ్యాల పాపయ్యశాస్త్రి



ది చిల్డ్రన్స్ బుక్ హౌస్ (రిజిష్టర్డ్)

# బంగారు ముంగిస



"కరుణశ్రీ"
జంధ్యాల పాపయ్యశాస్త్రి



ది చిల్డ్రన్స్ బుక్ హౌస్ (రిజిష్టర్డ్)
పబ్లిషర్సు, బుక్ సెల్లర్సు అండ్ స్టేషనర్సు
మెయిన్‌రోడ్ గుంటూరు-522001

*Price Rs 3–50*

అగ్ని పరీక్ష

మునిమూల్యం

జీవనదానం

తపోబలం

భీష్మప్రతిజ్ఞ

బంగారు ముంగిస

నేషనల్ ప్రింటర్స్ గుంటూరు-3

# అగ్ని పరీక్ష

చాలా సంతోషం మునికుమారా! నీవు కోరినట్లు నా కుమార్తె అయిన సుప్రభ ను నీ కిచ్చి వివాహం చేయడానికి నాకేమీ అభ్యంతరం లేదు అయితే అందుకు ముందుగా నీవు ఒకపని చెయాలి అన్నాడు వదాన్యమహర్షి

కన్యాదానం కోరివచ్చిన అష్టావక్రుడు వదాన్యమహర్షి ఔదార్యానికి ఆనందభరితుడైనాడు అతడు వినయంగా ఆజ్ఞాపించండి మహర్షి! సుప్రభ పాణిగ్రహణం కోసం నేను ఎంతశ్రమ అయినా భరిస్తాను ఎంత కష్టకార్యమైనా సాధిస్తాను దిగంతాలకైనా ప్రయాణం చేస్తాను నన్ను ఎక్కడకు వెళ్ళమంటారు! ఏమి చేయమంటారు! అని అడిగాడు

వదాన్యమహర్షి నిష్కాగరిష్ఠుడైన అష్టావక్రుడి మాటలకు సంతుష్టి పొందాడు మునికుమారా! సుగుణసంపన్న అయిన నా ప్రియ పుత్రి సుప్రభకు నీవు అన్ని విధాలా తగిన వరుడవని నాకు తెలుసు అద్భుతమైన బ్రహ్మచర్య ప్రభావం వల్ల ఎంత క్లిష్ట కార్యమైనా నీవు అనాయాసంగా సాధిస్తావని నేను ఎరుగుదును అందుకే నిన్ను ఈ మహత్కార్యంలో నియోగిస్తున్నాను నీవు ఇక్కడనుండి ఉత్తరదిక్కుగా బయలుదేరి పోవాలి ధనదునిపురం సందర్శించి హిమాలయాలు అధిగమించాలి ఇక్కడ పార్వతీదేవి పరమశివునిగూర్చి తపస్సు చేసిన పవిత్ర ప్రదేశం సందర్శించాలి ఆప్రాంతం దాటి కడిమిచెట్లతో ప్రకాశించే కాననంలో ప్రవేశించాలి ఆ అరణ్యంలో నీకు రమణీయమైన ఒక రత్నాల మేడ కనిపిస్తుంది, ఆ మేడలో ఉన్న

సుందరీమణిని సందర్శించి నీవు సురక్షితంగా వెనుదిరి వస్తే నీకు మా సుప్రభ ను ఇచ్చి వివాహం చేస్తాను అని పలికాడు వదాన్య మహర్షి



అష్టావక్రుడు ఆలోచనా నిమగ్నుడైనాడు గుణంలో కులంలో రూపంలో విద్యలో అన్ని విధాలా తాను సుప్రభకు తగినవాడు తన వంటి మునికుమారుడు కన్యను కోరివస్తే ఈ వదాన్యమహర్షి ఇటువంటి ప్రయాణం ఎందుకు ఏర్పరుస్తున్నాడో అర్థం కాలేదు అష్టావక్రుడికి అయినా అన్నమాట ప్రకారం అష్టావక్రుడు వదాన్యమహర్షి కోరినట్లు వెనువెంటనే ఉత్తరదిక్కుగా ప్రయాణమై వెళ్ళాడు

అష్టావక్రుడు నడచి నడచి పవిత్రమైన బాహుదానదిని దాటాడు ఆ రాత్రి నదీతీరంలో విశ్రమించాడు మరునాటి ఉదయమే

మళ్ళీ ప్రయాణం సాగించాడు కొంతకాలానికి ధనదునిపురం చేరు కన్నాడు అష్టావక్రుడు వచ్చిన వార్త తెలియగానే ఆ పురాధిపతి కుబేరుడు సగౌరవంగా ఎదురువచ్చి స్వాగతం ఇచ్చాడు సాదరంగా నగరంలోనికి తీసుకొని వెళ్ళాడు పీడిది గృహంలో ప్రవేశపెట్టి ఆద రంగా అతిథిపూజ చేశాడు అప్సరసల ఆట పాటలతో అష్టావక్రుడికి వినోదం కల్పించాడు అష్టావక్రుడు కుబేరుని సత్కారాలు పొందుతూ సంతోషంగా ఒక సంవత్సరకాలం అక్కడనే ఉన్నాడు

ఒకనాడు బేరుడు అష్టావక్రుణ్ణి చూసి మునికుమారా! తాము ఏమిపనిమీద ఇలా బయలుదేరి వచ్చారు తమకు నావల్ల కాగల సహాయం ఏమైనా ఉన్నదా ? దయచేసి ఆజ్ఞాపించండి అని అడిగాడు అష్టావక్రుడు నవ్వుతూ మరేమీలేదు కుబేరా! నేను ఒకమునివరేణ్యుని అజ్ఞానుసారం ఇలా ఉత్తరదిక్కుగా ప్రయాణమై వస్తున్నాను ఇక్కడి ఆదరాభిమానాలకు ముగ్ధుడనై ఆనందముగా కొంతకాలం గడిపాను ఇక నాకు కావలసింది ఏమీలేదు నీకు శుభం అవుతుంది నేను వెళ్ళివస్తాను అని కుబేరుని దగ్గర సెలవు దీసు కొని బయలుదేరాడు

అష్టావక్రుడు హిమాలయ పర్వతంమీద ప్రయాణం సాగించాడు పార్వతీ పరమేశ్వరుల క్రీడా ప్రదేశం సందర్శించాడు ముందుకు నడచి కడిమిచెట్లతో కళకళ లాడుతున్న కాననంలో ప్రవేశించాడు ఆతనికి ఆ అరణ్య మధ్యంలో ఆకాశాన్ని అంటుతున్న రత్నాలసౌధాలు కనిపించాయి రమణీయములైన ఆరత్నాల మేడల మధ్య మణిమయ మైన ఒక మహాసౌధం ప్రకాశిస్తున్నది

అష్టావక్రుడు ఆ మణిసౌధం ముందుకు చేరి నిలిచాడు ద్వారం దగ్గర ఉన్న కన్యకలు అతని పేరు అడిగి తెలుసుకొన్నారు

వారందరు అతనిని సగౌరవంగా సౌధం లోపలికి తోడ్కొని వెళ్లారు అభ్యంతర మందిరంలో రత్నకాంతులతో రాజిల్లుతున్న పట్టుపరుపు మీద ఆసీనురాలై ఉన్న ఒక దివ్యమూర్తి సన్నిధిలో నిలిపారు అష్టావక్రుడు దివ్యాభరణాలతో దేదీప్యమానంగా శోభిల్లుతున్న ఆస్త్ర రత్నాన్నిచూచి ఆశ్చర్య పరవశుడైనాడు అతడు ఆమెకు శుభం పలికి అలాగే నిలబడిపోయాడు

దివ్యకాంత అష్టావక్రుణ్ణి సవినయంగా సకౌతుకంగా ఆహ్వానించింది రండి ఆర్యా! ఇలా దయచేయండి ఈ పర్యంకం మీద ఆసీనులుకండి దయచేసి మా ఆతిథ్య సత్కారం అందుకోండి అని దివ్యకాంత అతనిని పర్యంకం మీద కూర్చుండబెట్టింది సముచితంగా అతిదిమర్యాద చేసింది ప్రేమ పురస్కరంగా ఆయన ప్రక్కన ఉన్న మరొక శయ్యమీద ఆసీనురాలైంది

అష్టావక్రుడు ఆమె ఆదరానికి ఆనందభరితుడైనాడు ఆయన ఆ మందిరములో అటూ ఇటూ సంచరిస్తున్న కన్యకల వైపుచూశాడు వారి విలాసాలు ఆయనకు విభ్రమం కలిగించాయి ఆయన దివ్యకాంతను ఉద్దేశించి ఈ కన్యకలందరూ ఇక్కడ ఎందుకు? అన్నాడు వెంటనే దివ్యకాంత ఆకన్యల నందరినీ ఆవలకుపొమ్మని ఆజ్ఞాపించింది

అందరూ వెళ్ళిపోగానే అష్టావక్రుడితో సరస సల్లాపాలు సాగించింది ఆమె శయ్యమీద నుంచి దిగ్గున లేచింది మునికుమారుడివైపు ఒయ్యారంగా చూస్తూ అబ్బా! చలిబాధ అధికంగా ఉన్నది ఇకశయనించాలి అంటూ అతని శయ్యమీదనే ప్రక్కగా శయనించింది దివ్యకాంత అష్టావక్రుడు దిగ్భ్రాంతి పొందాడు దివ్యకాంత మౌనంగా వున్న అష్టావక్రుడి దగ్గర చేరి మునికుమారా!

నన్ను నీ భార్యగా స్వీకరించు నాతోకూడి దివ్యభోగాలు అనుభవించు నా ఈ సంపదలన్నీ నీవి నేను నీదానను అని పలికింది

అష్టావక్రుడు ప్రక్కమీద నుంచి చివాలున లేచాడు దివ్య కాంతవైపు తీక్షణంగా చూస్తూ నీవు కోరిన కోరిక చాల అనుచితంగా ఉన్నది నీవు తలంచినట్లుగా నేను దురాచారుణ్ణి కాలేను బహుకాలం బ్రహ్మచర్య నిష్ఠలో గడిపి నేను ఇటీవలనే ఒక ముని పుత్రిని వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాను నిన్ను చూసి సురక్షితంగా వెనుది రిగివస్తే అమెను నాకిచ్చి వివాహం చేస్తానని ఆ మునీంద్రుడు వాగ్దానం చేశాడు అందుకోసమే ఇప్పుడు ఇంతదూరం నేను ప్రయాణం చేసి వచ్చాను నేను వచ్చిన పని సఫలం అయింది ఇక వెళ్ళివస్తాను అని పలికాడు అష్టావక్రుడు

ఆ మాటలు విని దివ్యకాంత అలకపోకగా నవ్వుతూ ముని కుమారా! కార్యం కాగానే అలాగే వెళ్ళుదువుగాని అంతవరకు ఉండు మరి అన్నది

నీవు దూరంగా నిలిస్తే ఇక్కడ ఎంతసేపైనా ఉందును నీవు అధర్మంగా ప్రవర్తిస్తే ఇప్పుడే వెళ్ళిపోతాను అంటూ ప్రక్కమీద ఒక ప్రక్కకు ఒదిగి కూర్చున్నాడు అష్టావక్రుడు

అష్టావక్రుడి మనసులో ఎన్నెనో ఆలోచనలు చెలరేగినవి ఈ సుందరిమణి ఎవరై ఉంటుంది ఈమె పుట్టుపూర్వోత్తరాలు ఏమిటో నేను ఇంతవరకు తెలుసుకోనేలేదు ఈమె నిజంగా ఎవరో దేవకన్య అయిఉంటుంది మరి దేవకన్య అయితే ఇలా మనస్సు మీరినట్లు ఎందుకు కనిపిస్తుంది ఒక వేళ ఎవరి శాపం వల్లనో ఈమె ఈ వయోభారం పొంది ఉండవచ్చు అయినా ఈమె ఒంటరిగా ఈ అర ణ్యంలో ఈ రత్నసౌధంలో ఎందుకు వుంటున్నదో ఏది ఏమైనా నాకు

ఈమె చరిత్రతో పనిలేదు ఈమె స్థితిగతులు నేను ఎందుకు తెలుసు కోవాలి ఈమెను గూర్చి నే నెందుకు జాలిపడాలి ఆ వదాన్య మహర్షి చెప్పినట్లు ఇక్కడకు వచ్చాను ఈమెను చూచాను ఇక మిగిలిన సంగతులు నాకు అనవసరం అనుకుంటూ శయ్యమీద పరుండి కళ్ళు మూసుకొన్నాడు అష్టావక్రుడు

తెల్లవారింది అష్టావక్రుడు నిద్రలేచాడు దివ్యకాంత ఆతనికి స్నానవసతులు సమకూర్చించి యథావిదిగా అగ్ని కార్యాలు జరి పించింది అన్నపానాలు సమర్పించిది విశ్రాంతిగా కూర్చుండి ఉన్న మునికుమారుడితో ఇష్టాగోష్ఠి ప్రారంభించింది ఆర్యా ! నేను కన్యకను ! స్వతంత్రను ! నిన్ను వలచి ఉన్నాను నన్ను పెండ్లాడి హాయిగా అన్ని సుఖాలు అనుభవించు అని అతనిని వేడుకొన్నది దివ్యకాంత అష్టావక్రుడు తలఅడ్డంగా తిప్పుతూ మళ్ళీ ఆమాటఅనకు సుందరీ నా హృదయం మరొక కన్యకు అంకితమై ఉన్నది నేను నిన్ను చేపట్టటం అసంభవం" అని పలికాడు

అంతవరకు ప్రౌఢకాంతగా వున్న ఆ దివ్యసుందరి క్రమ క్రమంగా నవయువతిగా మారిపోయింది ఆమె ముఖంలో క్రొత్త సొగసు తళుకొత్తింది ఆమె విలాసంగా మునికుమారుడి కన్నులలోకి చూచింది అయినా అష్టావక్రుడి మనసు చలించలేదు అతడు నిశ్చలంగా ఆమెవంకచూచి సుందరీ! నీ వెవరవో దివ్యమూర్తివి అయి ఉంటావు ! ఇక ఈ మాయలు ఎందుకు ? నీవు ఎవరో చెప్పు నీవు ఇక్కడ ఎందుకున్నావో ఈ విధంగా నన్ను వరించమని నిర్బం ధించడానికి కారణం ఎమిటో వివరించి చెప్పు ఇక నేను వెళ్ళిపోవాలి' నీవృత్తాంతం చెప్పి నాకు సెలవు యిచ్చి పంపు అని వేడుకొన్నాడు

అష్టావక్రుడి నిష్ఠా గరిష్ఠతకు దివ్యకాంత సంతోషించింది ఆమె ప్రీతి పూర్వకంగా మునికుమారా! నేను ఉత్తర దిక్కును

నీ నియమనిష్టలను పరీక్షించటం కోసం ఈ విధంగా స్త్రీ రూపంధరించి వచ్చాను మహాత్ముడైన వదాన్యమహర్షి నీ బ్రహ్మచర్య బలం పరీక్షించటంకోసమే నిన్ను నా దగ్గరకు పంపాడు మేము పెట్టిన ఈ అగ్నిపరీక్షలో నీవు విజయం పొందావు! నీ ఆత్మబలాన్ని నీ ధర్మ బుద్ధిని నేను మెచ్చుకొంటున్నాను నీ యాత్ర ఫలించింది ఇక నీవు సురక్షితంగా మహర్షి సన్నిధికి తిరిగి వెళ్ళు ఆయన నీకు సుప్రభ నిచ్చి వివాహం చేస్తాడు నీకు శుభం అవుతుంది" అని అతనిని ఆశీర్వదించింది

అష్టావక్రుడు ఆ దివ్యమూర్తికి నమస్కరించి ఆమె అనుమతి పొంది వెనుదిరిగి వచ్చాడు మరలి వచ్చిన మునికుమారుణ్ణి చూచి వదాన్యమహర్షి పరమానంద పరవశుడైనాడు నిష్ఠావంతుడైన అష్టావక్రుడికి తన ప్రియపుత్రి అయిన సుప్రభను ఇచ్చి మహావైభవంగా వివాహం చేశాడు వదాన్యమహర్షి అష్టావక్రుడు అభీష్టం ఫలించింది

—0—

# ముని మాహాత్మ్యం

'మన్నించండి మహర్షీ ! తెలియక చేసిన మా అపచారాన్ని మన్నించండి ఎప్పటిలాగానే చేపలకోసం వల విసిరాము చేపలతో పాటు తమరు కూడా వలలో చిక్కుపడ్డారు ! మా తప్పు మన్నించండి మహర్షీ" అని చేపలుపట్టి జీవించే జాలరులు చ్యవనమహర్షిని చేతులు మోడ్చి ప్రార్థించా

దయామయుడైన చ్యవనమహర్షి అమాయికులైన జాలరుల ప్రార్థన మన్నించాడు "భయపడకండి నాయనలారా ! ఆ నదీ గర్భంలో చేపలతోపాటు నేనుకూడా తపోనిష్ఠలో నిలచి ఉన్నానని తెలియక మీరు వలవేసి పట్టారు ఎరుగక చేసిన అపరాధాన్ని నేను హృదయపూర్వకంగా క్షమిస్తున్నాను అని వాళ్ళకు అభయం ఇచ్చాడు చ్యవనమహర్షి

చ్యవనమహర్షి మహాతపశ్శాలి ఆయన పవిత్రమైన గంగా యమునల సంగమ స్థలంలో నీటిలో మునిగి నిశ్చలంగా తపోదీక్ష వహించాడు నీళ్ళలోఉన్న చేపలన్నీ గుంపులు గుంపుగా వచ్చి ఆయ చుట్టు నిలిచి ఉన్నవి దీక్షాదక్షుడైన చ్యవనమహర్షి అలాగే వుండి పన్నెండేండ్లపాటు మహాతపస్సు కావించాడు చేపలన్ని ఆయ నను అంటుకొని అలాగే నిల్చి ఉన్నవి

మరొకనాడు కొందరు జాలరులు చేపలు పట్టటం కోసం అక్కడకు వచ్చారు నదీజలంలో వలవేసి చేపల వేట ప్రారం భించారు ఒకసారి వల వేయగానే చేపలతో పాటు చ్యవన

మహర్షి కూడ వలలో చిక్కుపడాడు ఆయనను చూడగానే జాలరులు భయభ్రాంతులైపోయారు వాళ్ళు గడగడ వణుకుతూ ఆ మహర్షిని వలలోనుండి తప్పించారు ఆ మహాత్ముని పాదాల మీద పడి మన్నించమని వేడుకొన్నారు ఇప్పుడు తాము ఏమి చేయవలెనో దయచేసి చెప్పమని ప్రార్థించారు

చ్యవనమహర్షి ప్రశాంతంగా జాలరులనుచూచి "నాయనా లారా! మీ బ్రతుకుతెరువు కోసం మీరు చేపలు పట్టుకొన్నారు మీ కులవృత్తి మీరు అనుసరించారు ఇందులో మీ దోషం ఏమీ లేదు ఇప్పుడు నాతోపాటు వలలో పడిన ఈ చేపలన్నీ నాకు ఆత్మబంధువులు చాలాకాలంగా నేను వాటితోపాటు కలసి మెలసి వున్నాను అందువల్ల వాటిని నేను ప్రాణాధికంగా ప్రేమిస్తు న్నాను ఇప్పుడు వాటిని విడిచిపెట్టడం నాకు న్యాయం కాదు కనుక మీరు ఈ చేపలతోపాటు నన్నుకూడా అమ్ముకొని తగినధనం సంపా దించుకోండి అదే మీరు చేయవలసిన పని సందేహించకండి అని పలికాడు

ఆ మాటలు విని జాలరులు విభ్రాంతులైనారు "వల పన్ని పట్టిన పాపం చాలక ఆ మహాత్ముణ్ణి చేపలతోపాటు అమ్ము కోవటం కూడానా? అమ్మో! అది ఎంత అపచారం? అను కొన్నారు జాలరులు వాళ్ళు ఏమీ తోచక తమ ప్రభువైన నహుషమహారాజు దగ్గరకు వెళ్ళారు జరిగినదంతా ఆయనకు మనవి చేసుకున్నారు ధర్మమూర్తి అయిన నహుషమహారాజు జాలరుల మాటలు ఆలకించాడు భయ సంభ్రమాలతో సపరివారంగా మహర్షి సన్నిధికి బయలుదేరి వచ్చాడు నదీ తీరంలో చ్యవన మహర్షిని సందర్శించి సాష్టాంగ నమస్కారం చేశాడు నహుష

భూపతి మునీంద్రా ! ఈ జాలరులు చేసిన మహాపరాధానికి ప్రాయశ్చిత్తం చెప్పండి నా ప్రజలు చేసిన ఈ పాప కర్మకు బాధ్యుణ్ణి నేను తమకు జరిగిన ఈ అపచారానికి తగిన ఫలం రాజునైన నేను అనుభవించాలి ఆజ్ఞాపించండి మహర్షీ ! నా కర్తవ్యం ఏమిటో ఆజ్ఞాపించండి" అని చ్యవనమహర్షిని సవినయంగా వేడుకొన్నాడు నహుషభూపతి

మహారాజు ధర్మబుద్ధికి చ్యవనమహర్షి సంతోషపడ్డాడు ఆయన సాదరంగా రాజువంక చూస్తూ చింతపడకు మహారాజా ఇందులో ఈ జాలరులు చేసిన ద్రోహం పాపం ఏమీ లేదు పాపం వీళ్ళు ఎన్నో చేపలు లభిస్తాయని వల విసిరి వేస్తే ఎందుకూ పనికిరాని నేనొకణ్ణి దొరికాను నామూలంగా వీళ్ళ కష్టానికి తగిన ప్రతిఫలం లభించక పోవటం న్యాయంకాదు అందువల్ల నా దేహానికి తగిన వెల నీవు ఈ జాలరుల కిచ్చి పంపించాలని నా కోరిక నా కోరిక తీర్చటమే నీ కర్తవ్యం" అని పలికాడు

పుణ్యాత్ముడైన మునీంద్రుని మాటలు వినగానే అంతులేని ఆశ్చర్యం కలిగింది మహారాజుకు తపోభంగం చేసి నీటిలో నుండి బయట పడవేసిన జాలరులకు తగిన ప్రతిఫలం ఇవ్వగోరుతున్న ఆ మునీశ్వరుడి ఔదార్యానికి పులకించిపోయాడు నహుషభూపతి ఆయన వెంటనే మంత్రిని పిలిచి కోశాగారం నుంచి వెయ్యి బంగారు నాణాలు ఆ జాలరులకు ఇవ్వవలసిందని ఆజ్ఞాపించాడు ఆ ఆజ్ఞ విని చ్యవన మహర్షి "అలాకాదు మహారాజ ! నా దేహానికి తగిన వెల అదికాదు న్యాయంగా ఆలోచించి ఇవ్వు" అని పలికాడు

మహారాజు మందహాసం చేస్తూ "అయితే పదివేల బంగారు నాణాలు ఇస్తాను మహర్షీ" అన్నాడు "నా మూల్యం అదికాదు"

అని పలికాడు చ్యవనమహర్షి "లక్ష బంగారు నాణాలు ఇమ్మంటాను మహాత్మా!" అన్నాడు మహారాజు అదీ నాకు తగిన విలువ కాదు అన్నాడు మహర్షి తల అడ్డంగా త్రిప్పుతూ మహారాజు ఆశ్చర్యపడుతూ "కోటి బంగారు నాణాలు ఇప్పిస్తాను మహాముని, తమకు సమ్మతమేనా' అని అడిగాడు అందుకు మహర్షి సమ్మతించలేదు "కాదు మహారాజా! నాకు తగిన వెల కాగా ఆలోచించి ఇవ్వాలి" అన్నాడు చ్యవనమహర్షి మహారాజు కొంచెం ఆలోచించి "అయితే జాలరులకు నా అర్ధ రాజ్యం ఇస్తాను మహర్షి అందుకు ఏమంటారు" అని ప్రశ్నించాడు చ్యవనమహర్షి చిరునవ్వు నవ్వుతూ "అలా తొందర పడకు మహారాజా! నీవూ నీ మంత్రులూ మిత్రులూ అందరూ కలిసి ఆలోచించి నా దేహానికి తగిన మూల్యం నిర్ణయించి చెప్పండి" అని పలికాడు

మహారాజుకు ఏమీ తోచలేదు ఆయన అమాత్యులతో ఆప్తమిత్రులతో ఆలోచన చేశాడు "మహాముని! నా సమస్త సామ్రాజ్యమూ నా ధన కనక వస్తువాహనాలూ అన్నీ కలిసి తమ దేహానికి తగిన మూల్యం కావచ్చునని భావిస్తున్నాము. అందువల్ల అవి అన్నీ ఆ జాలరులకు ఇస్తాను తమకు అంగీకారమేనా?" అని అడిగాడు నహుష భూపతి

చ్యవనమహర్షి అందుకు ఆమోదం ప్రకటించలేదు "అదీ సరి కాదు మహారాజా, నా మూల్యం మీరు సరిగా నిర్ణయించలేదు ఈ సమీపంలో "గవిజాతుడు అనే ఒక మహర్షి ఉన్నాడు ఆయనను దర్శించి కర్తవ్యమార్గం గుర్తించుకో" అని పలికాడు చ్యవన మహర్షి నహుషభూపతి గవిజాత మహర్షిని సందర్శించాడు విషయం అంతా ఆయనకు వివరించి చెప్పాడు "చ్యవనమహర్షి మూల్యం ఏమో నిశ్చయించి చెప్పండి నన్ను కష్టసముద్రంలో నుంచి కాపాడండి"

అని గవిజాత మహర్షిని ప్రార్థించాడు నహుషమహారాజు. అతని ప్రార్థన విని గవిజాత మహర్షి పక్కున నవ్వాడు. "రాజా! మహా తపస్వి అయిన చ్యవన మహర్షికి వెల కట్టడం ఎవరికి సాధ్యం అవు




తుంది? అయినా ప్రస్తుతం నీకు ఈ ఆపద గడవటం కోసం ఒక ఉపాయం చెప్తాను. "బ్రహ్మజ్ఞాని అయిన తపస్వి విలువ, లోక పావనమైన గోవు విలువ సమానం" అని పెద్ద లంటారు. అందువల్ల

నీవు చ్యవనమహర్షి దేహానికి బదులుగా పవిత్రమైన ఒక ఆవును తెచ్చి ఆ జాలరులకు దానం ఇవ్వవచ్చు" అని కర్తవ్యం ఉపదేశించాడు గవిజాత మహర్షి

నహుషభూపతి చ్యవనమహర్షిని సందర్శించి "మునీంద్రా తమకు తగిన మూల్యం 'ఆవు' ఒకటేనని గవిజాత మహర్షి నిర్ణయించారు వారి ఆజ్ఞానుసారం సల్లక్షణ సంపన్నమైన ఆవును తెచ్చి తమకు బదులుగా జాలరులకు ఇస్తాను అందుకు మీరు అనుమతించండి" అని వినయంగా మనవి చేసుకొన్నాడు ఆ మాటలు వినగానే చ్యవనమహర్షి ముఖం వికసించింది "ఆయన మనస్సుకు సంతుష్టి కలిగింది "మంచిది మహారాజా! నీవు నా మూల్యం ఇప్పుడు సరిగా గుర్తించావు నాకు చాలా సంతోషంగా ఉన్నది సల్లక్షణ సంపన్నమైన గోవు మహాలక్ష్మి వంటిది గోలక్ష్మి లోకపూజ్యమైనది అమృతమయమైనది పరమ పవిత్రమైన గోధనం కంటె గొప్ప ధనం ప్రపంచములో మరొకటి లేదు గోరక్షణకంటె లోకంలో ఉత్తమ కార్యంలేదు గోపాలనంకంటె భూమండలములో ఉత్తమ వృత్తి లేదు గోదానంకంటె పుణ్యప్రదమైన మహాదానం వేరేలేదు అందువల్ల నీవు నాకు బదులుగా ఒక మంచి కపిలగోవును తెచ్చి ఈ జాలరులకు ఇవ్వు అదే నాకు పరమానందకరం" అని పలికాడు చ్యవనమహర్షి

వెనువెంటనే నహుషభూపతి నగరం నుంచి ఒక చక్కని ఆవును తెప్పించాడు ముని దేహానికి బదులుగా ఆ గోవును జాలరులకు ఇచ్చాడు జాలరులు చ్యవనమహర్షి పాదాలకు మ్రొక్కి "స్వామీ! అకారణంగా మామీద ఇంత దయ చూపించారు మా మనవి ఒక్కటి ఆలకించండి మమ్ముల్ని అనుగ్రహించండి మహారాజు

మాకు ఇచ్చిన ఆవును కానుకగా తమరు స్వీకరించాలని మా కోరిక మా కోరిక మీరు కాదనకూడదు స్వామీ అని వేడుకున్నారు చ్యవనమహర్షి వారి ప్రార్థన కాదనలేకపోయాడు జాలరుల కోరిక తీర్చటంకోసం ఆయన వారిచ్చిన ఆవును పరిగ్రహించాడు వారి సద్బుద్ధికి మెచ్చుకొని "జాలరులారా ! నాకు గోదానం చేసిన మీకు నా కూర్మి మిత్రములైన ఆ చేపలకూ నా తపోబలంవల్ల పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయి వెళ్ళండి, సుఖంగా సంతోషంగా కాలం గడపండి" అని వాళ్ళను చేయెత్తి దీవించాడు చ్యవనమహర్షి

ఆ మాటలు విని ఆశ్చర్యమగ్నుడైనాడు నహుషభూపతి అతనిని చూచి చ్యవనమహర్షి ఆదరంగా "మహారాజా ! నీ ధర్మబుద్ధికి, నీ ఔదార్య నిరతికి నేను చాలా ఆనందించాను నీవు మహేంద్ర వైభవంతో బహుకాలం ధర్మమార్గంలో ధరాతలాన్ని పరిపాలిస్తావు నీకు శుభం అవుతుంది వెళ్ళు" అని ఆశీర్వదించి ఆ నదీతీరంలో గబ గబా ముందుకు సాగిపోయాడు

— 0 —

# జీవనహానం

"ఎవరు స్వామీ మీరు ? ఎక్కడనుంచి వస్తున్నారు ? ఈ మహారణ్యంలో ఈ మఱ్ఱిచెట్టుక్రింద ఒంటరిగా ఎందుకు కూర్చొన్నారు" అని బ్రాహ్మణుణ్ణి అడిగాడు విహారానికి వెళ్ళి తన చెట్టు క్రిందకి తిరిగివచ్చిన నాడీజంఘుడు

బ్రాహ్మణుడు మాటలు నేర్చిన ఆ బకరాజును చూచి ఆశ్చర్యపడ్డాడు బకరాజా! మాది మధ్యదేశం నేను బ్రాహ్మణ కులంలో జన్మించాను కాని చిన్నతనమునుంచి దుస్సహవాసం చేసి దురాచారుణ్ణి అయినాను చదువూ సంధ్యా లేకుండా దుష్కార్యాలు చేయటానికి అలవాటు పడ్డాను కులగౌరవాన్నీ వంశ మర్యాదనూ పాటించకుండా పాపమార్గములో ప్రవర్తించాను ఒకబోయకాంతను పెండ్లాడి దానితో కలసి బోయపల్లెలో కాపురం పెట్టాను కిరాతులతో పాటు జంతువులను వేటాడుతూ మద్య మాంసాలు సేవిస్తూ స్వేచ్ఛగా సంచరించాను కాని ఎక్కువకాలం ఆ దరిద్ర జీవనం గడపలేకపోయాను నాకు ధనం సంపాదించాలని కోరిక కలిగింది అందుకోసం తగిన మార్గం ఆలోచిస్తూ ఉండగా మా పల్లె ప్రక్కగా వ్యాపారం కోసం దూరదేశాలకు పోతున్న ఒక వర్తకుల గుంపు కనిపించింది నేను వాళ్ళను మంచి చేసుకొని, వాళ్ళ వెంట దేశాంతరానికి బయలుదేరాను మార్గమధ్యంలో ఈ మహారణ్యంలో ఒక మదపుటేనుగు ఆకస్మికంగా మా వర్తకుల గుంపుమీద విరుచుకు పడింది జనం అంతా చెల్లాచెదరై పోయారు ప్రాణం అరచేతిలో పెట్టుకొని నేను ఆ అడవి ఏనుగు బారినుంచి తప్పించుకొని ఉత్తరదిక్కుగా పరుగెత్తి పరుగెత్తి ఈ మఱ్ఱిచెట్టు దగ్గరకు

చేరుకున్నాను ఈ చెట్టునీడలో అలసట తీర్చుకుంటూ కూర్చుండి ఉన్నాను" అని పలికాడు బ్రాహ్మణుడు

దయామయుడైన నాడీజంఘుడు అతని మాటలు విని జాలి పడ్డాడు "ఇతని చరిత్ర ఎటువంటిదైతే ఏం ? పాపం ఇప్పుడు ఆపదలో ఉన్నాడు నాకు అతిథిగా వచ్చాడు అందువల్ల ఇతనిని ఆదరించటం నా ధర్మం" అనుకొన్నాడు ధర్మాత్ముడైన నాడీజంఘుడు అతడు ఆప్యాయంగా "మంచిది స్వామీ ఇప్పుడు మీరు నా నివాసమైన ఎటపృక్షం దగ్గరకు వచ్చారు కనుక నాకు అతిథులు అందువల్ల ఈ రాత్రికి మీరు ఇక్కడ ఉండి నా ఆతిథ్య సత్కార్యము అందుకోవాలి తరువాత మీ దారిద్ర్యము తీరటానికి తగిన సహాయము నేను చేస్తాను అని పలికాడు నాడీజంఘుడు

బ్రాహ్మణుడి ప్రాణం కుదుట పడ్డది ఇతడు సంతోషంగా "బకరాజా ! నీ వంటి దయామయుడి ఇంటికి రావటం నా అదృష్టం ఆప్తులందరికీ దూరమై దిక్కులేక అల్లాడుతున్న నాకు నీ ఆశ్రయం దొరకటం మహాభాగ్యం" అని పలికాడు

ఆ రాత్రి నాడీజంఘుడు రుచ్యములైన పదార్థములతో బ్రాహ్మణుడికి భోజనం పెట్టాడు గంగా జలంతో అతని దప్పి తీర్చాడు మధురములైన ఫలాలు తెచ్చి సంతుష్టిగా అతనికి సమర్పించాడు చిగుళ్ళతో పువ్వులతో మెత్తగా ప్రక్క పరచి అతనికి శయ్య ఏర్పరిచాడు తన రెక్కలు విసరి చల్లగాలి కల్పించి సరస సల్లాపం చేస్తూ ఆ బ్రాహ్మణుణ్ణి హాయిగా నిద్ర పుచ్చాడు నాడీజంఘుడు

ఆ రాత్రి గడచింది బ్రాహ్మణుడు నిద్ర లేవగానే నాడీజంఘుడు 'స్వామీ! మీరు దారిద్ర్యబాధ భరించలేక ధన సంపాదన కోసం ఈ విధంగా బయలుదేరి వచ్చారు నేను మీకు కావలసినంత ధనం లభించే మార్గం ఒకటి మనవి చేస్తాను లోకంలో దారిద్ర్యం తీరటానికి నాలుగు మంచి మార్గాలు ఉన్నాయి మిత్రుడి వల్ల కొందరూ, బుద్ధిబలంవల్ల కొందరూ, బంగారంవల్ల కొందరూ వెండివల్ల మరికొందరూ తమ దారిద్ర్య గాథ తీర్చుకొంటూ ఉంటారు అయితే అన్ని మార్గాలలోను మిత్రుడివల్ల ధనార్జనము చేసే మార్గం ఉత్తమమైనది అందువల్లనే అన్ని లాభాలకంటె మిత్రలాభం గొప్పదని పెద్దలంటారు ఉత్తమ వంశములో పుట్టిన నేను మీతో మైత్రి వాటస్తున్నాను మనం ఇద్దరం మిత్రులు అయినాము అందువల్ల అపారధనం అర్జించుకొనే ఉపాయం మీకు నేను చెప్పదలిచాను" అని పలికాడు

వెంటనే బ్రాహ్మణుడు "ఆ మార్గం ఏదో ఇప్పుడే చెప్పు బకరాజా! అనాయాసంగా అపార ధనం అర్జించే ఉపాయం ఉంటే ఇంకా నాకేం కావాలి?" అన్నాడు

నాడీజంఘుడు నవ్వుతూ అలాగే మనవి చేస్తాను ఆర్యా! ఇక్కడకు మూడు యోజనాల దూరంలో 'మధువ్రజం' అనే పట్టణం ఉన్నది ఆ పట్టణాన్ని ధర్మాత్ముడైన 'విరూపాక్షుడు' అనే రాక్షస రాజు పరిపాలిస్తున్నాడు ఆ విరూపాక్షుడు నాకు ప్రాణమిత్రుడు మీరు వెంటనే బయలుదేరి వెళ్ళి ఆ విరూపాక్షుణ్ణి దర్శించాలి మిమ్మల్ని నేను పంపించానని అతనితో చెప్పితేచాలు మీకు ఎనలేని రత్నరాసులూ తులలేని బంగారు నాణాలూ బహుమానంగా ఇచ్చి పంపిస్తాడు అదుగో! ఆ కనిపించే త్రోవ వెంటనే వెళ్ళితే

మీరు మధుప్రవజపురం చేరుకుంటారు" అని ఆ పట్టానికి త్రోవ చూపించాడు వెనువెంటనే బ్రాహ్మణుడు విరూపాక్షుడి దగ్గరకు ప్రయాణమై వెళ్ళాడు రాక్షసరాజైన విరూపాక్షుడితో తాను నాడీజంఘుడు మిత్రుణ్ణి అనీ అతడు పంపగా వచ్చానని, తనకు ధనం కావాలనీ చెప్పుకొన్నాడు బ్రాహ్మణుడు

విరూపాక్షుడు అతడి వంక తేరిపార చూశాడు "ఈ బ్రాహ్మణుడి ముఖం చూస్తే దుర్మార్గుడిలా గా తోస్తున్నది ఇతడు మన నాడీజంఘుడికి ఎలా మిత్రుడైనాడబ్బా" అనుకొన్నాడు విరూపాక్షుడు అతడు బ్రాహ్మణుని వృత్తాంతం అంతా ఉన్నది ఉన్నట్లుగా చెప్పమని అడిగాడు బ్రాహ్మణుడు నిస్సందేహముగా తన చరిత్రం అంతా విరూపాక్షుడికి వివరించి చెప్పాడు అతని కథ విని విరూపాక్షుడు కొంచెంసేపు ఏమేమో ఆలోచించాడు "ఈ పాప చరిత్రుడికి సాయం చెయ్యటం పాముకు పాలు పోసినట్లు అవుతుందేమో" అనుకున్నాడు విరూపాక్షుడు 'ఏమైనాసరే, ఇతడు నాడీజంఘుడికి స్నేహితుడు అతడు పంపగా వచ్చాడు కనక ఎంత పాపాత్ముడైనా ఇతనికి నేను తప్పకుండా సహాయం చెయ్యాలి ఇతడు కోరినట్లు ధనం ఇచ్చి పంపితేనే నాడీజంఘుడు సంతోషిస్తాడు అని నిశ్చయించుకున్నాడు విరూపాక్షుడు

విరూపాక్షుడు బ్రాహ్మణుడికి సముచితంగా అతిథి సత్కారం చేశాడు అన్నపానాలు సమకూర్చాడు ఆ మర్నాడు కార్తీక పూర్ణిమ కావటంవల్ల విరూపాక్షుడు వేలకొలది బ్రాహ్మణులకు బంగారు పాత్రలతో అన్నదానం చేశాడు ఎన్నెన్నో ధనరాశులు దక్షిణగా ఇచ్చాడు అందరితోపాటు ఆదరంగా ఈ బ్రాహ్మణుడికి కూడా భోజనమూ దక్షిణా సమర్పించాడు అతడు అన్నం

తిని బంగారు పళ్ళెంతో పాటు మోయచేసన్ని ధన కనక రాసులను కూడా బ్రాహ్మణుడికి బహుమానంగా యిచ్చి పంపించాడు విరూపాక్షుడు



బ్రాహ్మణుడు ఆనందంగా ధనరాసు లన్నీ మూటలు కట్టుకొని బయలుదేరాడు ఆ మూటలు బరువు మోయలేక అతని మెడవంగి పోయింది వీపు క్రుంగిపోయింది అతడు అలాగే పడుతూ లేస్తూ మళ్ళీ నాడీజంఘుడు ఉన్న మర్రిచెట్టు దగ్గరకు చేరుకున్నాడు ఆ విధంగా కోరినంత ధనంతో తిరిగి వచ్చిన బ్రాహ్మణుణ్ణి చూసి ఆనందభరితుడైనాడు నాడీజంఘుడు 

అతడు ప్రయాసపడుతున్న బ్రాహ్మణుణ్ణి సేద దీర్చి తృప్తి పరచాడు ఆహారం పెట్టి మెత్తని పాన్పుమీద విశ్రమింపచేసి రెండు రెక్కలతో చల్లగాలి విసురుతూ హాయిగా నిద్రపోయాడు నాడీజంఘుడు కాని పాపాత్ముడయిన బ్రాహ్మణుడికి నిద్రపట్టలేదు అతడు కొంచెంసేపు కన్ను గూర్కి శయ్యమీద లేచి కూర్చున్నాడు తెల్లవారగనే తాను ఇంటికి బయలుదేరాలి మరి మార్గమధ్యంలో తనకు తిండి ఎలా దొరుకుతుంది ' అని ఆలోచన చేశాడు బ్రాహ్మణుడు అతని ప్రక్కనే మైమరచి నిద్రపోతున్న నాడీజంఘుడు కనిపించాడు ఆ దుష్టుని మనస్సులో ఒక దురుద్దేశం కలిగింది " ఈ కొంగ శరీరము బాగా క్రొవ్వి ఉన్నది దీని మాంసము చాలా రుచిగా ఉంటుంది కూడా అందువల్ల గాఢ నిద్రలో ఉన్న ఈ కొంగను చంపి తీసుకొని పోతాను దీని మాంసముతో మార్గమధ్యములో కడుపు నింపుకో వచ్చు " అనుకొన్నాడు దుష్టబ్రాహ్మణుడు అతడు వెంటనే ఒక మజ్జికొమ్మ విరిచి దానితో నాడీజంఘుడి మెడమీద గట్టిగా కొట్టి చంపివేశాడు ఈకలు రాల్చి దాని మాంసం అంతా మూట

కట్టుకొన్నాడు వేరువ జాము కాగానే ధనం మూటలతోపాటు మాంసం మూట కూడ తీసుకొని బయలుదేరి పోయాడు బ్రాహ్మణుడు

తెల్లవారగానే మధుబ్రవజపురంలో విరూపాక్షుడికి అపశకునాలు తోచాయి తన వారికి ఎవరికో ఏదో కీడు మూడి ఉంటుందని సందేహం కలిగింది విరూపాక్షుడికి జాము ప్రొద్దు ఎక్కింది ప్రతి రోజూ ఆ వేళకు తప్పకుండ తనదగ్గరకు వచ్చే తన ప్రాణమిత్రుడు నాడీజంఘుడు ఈనాడు ఎందుకు రాలేదా అని అనుమానం కలిగింది విరూపాక్షుడికి ఆ దుష్టబ్రాహ్మణుడు నాడీజంఘుడికి ఏమి హాని చేశాడో అని సందేహం కలిగింది విరూపాక్షుడికి అతడు వెంటనే నాడీజంఘుడు ఎలా ఉన్నాడో చూసి రమ్మని భటులను పిలిచి పంపాడు భటులు నాడీజంఘుడు నివసించే చెట్టుదగ్గరకు వెళ్ళి చూశారు అక్కడవారికి నాడీజంఘుడి అస్థిపంజరం ఒక్కటే కనిపించింది అక్కడక్కడ ఈకలు అన్నీ రాలిపడి ఉన్నాయి వాళ్ళు వెంటనే జరిగిన ప్రమాదం గ్రహించి బ్రాహ్మణుడు వెళ్ళిన మార్గము వెంట బడి పరుగెత్తి అతనిని పట్టుకొన్నారు ఆ దుర్మార్గుణ్ణి పెడరెక్కలు విరిచి కట్టి తెచ్చి విరూపాక్షుడి ముందు పడవేశారు భటులు

విరూపాక్షుడు ఆ నీచుడు చేసిన ఘోరకార్యానికి మండిపడ్డాడు భటులవైపు తిరిగి "విణ్ణి ఇక్కడకు ఎందుకు తెచ్చారు వెంటనే ఈ కృతఘ్నుణ్ణి చీల్చి చంపి తినండి" అని ఆజ్ఞాపించాడు విరూపాక్షుడు భటులు "వద్దు ప్రభూ, వద్దు మిత్ర ద్రోహి మాంసం తింటే మహాపాపంవస్తుంది వీడి శరీరం ముక్కలుముక్కలుగా తెగనరికి కాకులకూ గ్రద్దలకూ ఎగురవేస్తాం" అని ఆ దుష్టబ్రాహ్మణుడి దేహం ముక్కలుముక్కలుగా తెగ నరికి ఊరి బయట పారవేశారు ఆ కృతఘ్నుడి దేహం తినటానికి ఇష్టము లేక దగ్గరకు వచ్చిన కుక్కలు కూడా దూరదూరంగా తొలగి పోయినవి కాకులూ,

గ్రద్దలూ అల్లంత దూరంనుంచే వెనకకు ఎగిరి పోయినవి విరూపాక్షుడు భటులు తెచ్చిన మిత్రుడి అస్థిపంజరానికి అగ్నిసంస్కారం నిర్వర్తించాడు



అంతలోనే దేవేంద్రుడు అక్కడ ప్రత్యక్షమైనాడు

విరూపాక్షుడు కన్నీరు నింపుతూ "దేవరాజా! నా ప్రియమిత్రుడైన ఈ నాడీజంఘుడు అన్యాయంగా హతుడైనాడు ఇతడికి ప్రాణదానం చేసి అనుగ్రహించు" అని దేవేంద్రుణ్ణి ప్రార్థించాడు దేవేంద్రుడు విరూపాక్షమిత్ర ప్రేమను మెచ్చుకుంటూ "విచార

పంకు విరూపాక్షా! పుణ్యాత్ముడైన నాడీజంఘుడు బూడిదమీద కామధేనువు పాలుత్రాగుతున్న ఆవు దూడ నోటి నురుగు గాలికి వచ్చి పడింది అమృతమువంటి ఆ పాల నురుగువల్ల నాడీజంఘుడు బ్రతికి వస్తున్నాడు బ్రహ్మదేవుడి దయవల్ల నీ అభీష్టం ఫలించింది అడుగో నీ ప్రియమిత్రుడు" అని ఎప్పటి రూపంతో బ్రతికి వస్తున్న నాడీజంఘుణ్ణి చూపించాడు విరూపాక్షుడు పరమానందంతో నాడీజంఘుణ్ణి కౌగలించుకున్నాడు నాడీజంఘుడు మిత్రుడ్ని ఆదరించి దేవేంద్రుడికి నమస్కరించాడు అన్యాయంగా తనను హతమార్చిన ఆ బ్రాహ్మణుడి సంగతి తెలుసుకున్నాను

నాడీజంఘుడు దేవేంద్రుడికి చేతులు మోడ్చి 'దేవరాజా! నా వల్ల ఆ బ్రాహ్మణుడు నాశనం కావటం నేను సహించలే నా మీద దయవుంచి ఆ బ్రహ్మణుడికి ప్రాణదానం చెయ్యాలని నా ప్రార్థన" అని ఆయనను అభ్యర్థించాడు

దేవేంద్రుడు ఔదార్యమూర్తి అయిన నాడీజంఘుడి కోరిక తీర్చి అదృశ్యమైనాడు పునర్జీవితుడైన బ్రాహ్మణుడికి ధనరాసులన్నీ సమర్పించి సంతోషంగా సాగనంపాడు నాడీజంఘుడు చచ్చిబతికిన బ్రాహణుడు పశ్చాత్తాప పరితప్త హృదయంతో ధనరాసులను మోసుకుంటూ పుణ్యాత్ముడైన నాడీజంఘుడివైపూ వివేకవంతుడైన విరూపాక్షుడివైపూ తిరిగి తిరిగి చూస్తూ ఇంటిదారి పట్టాడు

# తపోబలం

'మన్నించండి మహర్షి! బాల్య చాపల్యంవల్ల నాకుమార్తె చేసిన మహాపచారాన్ని మన్నించండి" నా సైనికులకు కలిగిన మహా ప్రమాదం తొలగించండి అని చ్యవనమహర్షిని ప్రార్థించాడు శర్యాతి మహారాజు

పరమ వృద్ధుడైన చ్యవన మహర్షి 'పయోష్ణి' అనే సరస్సు దగ్గర ఘోర తపస్సు చేస్తున్నాడు బహుకాలంగా నియమ నిష్టలతో మహా తపస్సు చేస్తున్న చ్యవనమహర్షి చుట్టూ పెద్ద పుట్ట పెరిగింది అతని దేహం అంతా ఆ పుట్టలో కప్పబడిపోయింది పుట్టచుట్టూ తీగలూ, పొదలూ వ్యాపించి ఉండటంవల్ల ఆ మహర్షి అక్కడ ఉన్న సంగతి ఎవ్వరికి తెలియటం లేదు

ఒకనాడు శర్యాతిమహారాజు తన నాలుగువేల మంది రాణులతో కలసి ఆ సరస్సు దగ్గరకు విహారానికి వచ్చాడు అతనితో పాటు అసాంఖ్యాకమైన సేనా సమూహం కూడ అనుసరించి వచ్చింది శర్యాతి మహారాజు ప్రియ పుత్రిక అయిన 'సుకన్య' తన సఖులతో పాటు ఆ ప్రాంతంలో వినోద విహారం చేయసాగింది ఆమె అటూ ఇటూ తిరుగుతూ చ్యవన మహర్షి కూర్చుండి ఉన్న పుట్టదగ్గరకు వచ్చింది బాల్య చాపల్యం వల్ల పుట్టలో ఏమున్నదో అని తొంగి చూసింది సుకన్య ఆమెకు పుట్టలోనుంచి మిలమిల మెరుస్తున్న మహర్షి కన్నులు మిణుగురు పురుగులులాగా కన్పించాయి ఆమె 'అవేమిటో' అని ఆశ్చర్యపడుతూ రెండు పుల్లలు తీసుకొని ముని కళ్ళల్లో పొడిచింది చ్యవనమహర్షి బాధ పడుతూ కళ్ళు మూసుకొన్నాడు ఆ విధంగా ఆకస్మికంగా లోపలి కాంతులు అదృశ్యం

కావటం చూసి మరింత ఆశ్చర్యం కలిగింది సుకన్యకు ఆమె పుట్ట పై భాగం పెకలించి చూసింది ఏమీ కన్పించలేదు ఆమె విస్మయ పడుతూ సఖీ సమేతంగా తండ్రి దగ్గరకు పరు వెత్తిపోయింది

చ్యవన మహర్షికి తపోభంగం అయింది ఆయనకు పట్టరాని కోపం వచ్చింది ఆయన అలాగే కళ్ళు మూసుకొని తపోభంగానికి కారణము ఏమిటో ఆలోచించి గ్రహించాడు ఆగ్రహావేశంతో మండి పడుతూ రాకుమారి చేసిన అపరాధానికి ప్రతీకారం చేయాలని నిశ్చ యించుకొన్నాడు మరుక్షణంలో మహర్షి కోపం వల్ల శర్యాతి మహా రాజు సైన్యాల కన్నింటికి మలమూత్ర నిరోధం ఏర్పడింది సైనికుల కడుపులన్ని ఉబ్బిపోతున్నాయి ఆకస్మికంగా కలిగిన ఆ మహా ప్రమా దానికి సైన్యాలన్ని సంక్షోభించి పోయినవి శర్యాతి మహారాజు తన సేనలకు కలిగిన విపత్తుకు కారణము ఏమిటో ఆలోచించసాగాడు కాని ఏమీ అర్థం కాలేదు అతడు చింతాక్రాంతుడై అనుచరు లందరిని పిలిచి "మీలో ఎవరైనా ఏదైనా అకార్యం చేశారా" అని అడిగాడు అందరూ తాము ఏ అపచారమూ చేయలేదని మహారాజుతో మనవి చేసుకొన్నారు" శర్యాతి మహారాజు అర్థం కాని ఆందోళనతో పరితపి స్తున్నాడు

అంతలోనే రాకుమారి సుకన్య విషాదమగ్నురాలై న తండ్రి దగ్గ రకు వచ్చి ఈ విధంగా విన్నవించుకొన్నది "నాన్నగారూ ! ఇంతకు ముందే నేను నా సఖులూ వినోద విహారము చేస్తూ ఒక పుట్టలో మిణుగురు పురుగులాగా ధగధగ మెరుస్తున్న రెండు కాంతికళికలను చూశాము అవి ఏమిటో తెలుసుకోవాలని పుల్లలతో పొడిచాను రెండు కళికలూ మాయమై పోయినవి పుట్ట పెకిలించి చూసి

ఏమీ తెలుసుకోలేక ఇలా వరగత్తి వచ్చారు ఒక వేళ అందు వల్లనే మన సైన్యాల కష్టానికి ఈ ఆపద వచ్చిందేమో" అని పలికింది సుకన్య

ఆ మాటలు విని శర్యాతి గబగబా పుట్టదగ్గరకు పరుగెత్తి పోయాడు పుట్ట అంతా త్రవ్వించి పరిశీలించి చూశాడు ఆ పుట్టలో తపః క్లేశంవల్ల కృశించిపోయి నేలకు అంటివున్న పరమవృద్ధుడు చ్యవన మహర్షి కనిపించాడు శర్యాతి మహారాజు చ్యవన మహర్షి భక్తిపూర్వకంగా ప్రణామముచేసి తన కుమార్తె చేసిన తప్పు మన్నించ మని ప్రార్థించాడు కోపం విడిచి తన సేనకు పెట్టిన శాపము ఉప సంహారించమని వేడుకొన్నాడు

దయామయుడైన చ్యవన మహర్షి శాంతి పొందాడు "రాజా! నీకుమార్తె రాజపుత్రికననే అహంకారముతో అన్యాయముగా తపో దీక్షలో వున్న మాకు వ్రతభంగం కలిగింపంది మమ్మల్ని చాలా బాధ పెట్టింది ఆమె చేసిన అకార్యం వల్లనే నీ సేనలకు ఆగతిపట్టింది అయినా నీ వినయ విధేయతలు చూస్తె మాకు చాల జాలి కలిగింది నీవు గోరినట్లు మాశాపము ఉపసంహారించు కుంటాము నీ సేనలకు ప్రమాదం తొలగిస్తాము కాని అందుకు ఒక్క నియమం ఉన్నది రూపగర్వంతో యౌవన మదంతో ప్రవర్తించిన నీ కుమార్తెను నీవు మాకిచ్చి వివాహం చేయాలి అందుకు నీవు అంగీకరిస్తే నీ ప్రార్థన మేము మన్నిస్తాము అని పలికాడు చ్యవన మహర్షి

పరమవృద్ధుడైన ఆ మునీంద్రునికి సుకుమారి అయిన సుకన్యను ఇచ్చి వివాహము చేయటానికి మహారాజుకు మనస్సు ఒప్పలేదు "ఎండ కన్నెరుగని తన బిడ్డ ఆ జడదారితో అరణ్యములో ఎలా కాపు రము చేస్తుంది" అని దుఃఖం కలిగింది శర్యాతికి కానీ మునికోరిక

తిరస్కరిస్తే తన సేనలకు కలిగిన మహావిపత్తు ఎలా తొలగిపోతుంది శర్యాతి మహారాజుకు ఏమి చెయ్యాటానికి తోచలేదు ఆ విధంగా ఆలోచనామగ్నుడై ఉన్న తండ్రిని చూచింది సుకన్య "తన వల్ల ఏర్పడిన అరిష్టమునుంచి తండ్రికి విముక్తి కలగాలంటే తాను తప్పకుండా చ్యవనమహర్షిని పెండ్లాడాలి అవును తాను ఆ మునిని పెండ్లాడక తప్పదు" అనుకొన్నది సుకన్య ఆమె తన తండ్రితో చ్యవన మహర్షిని పెండ్లాడటానికి తన అంగీకారము తెలిపింది శర్యాతి మహారాజు తన ప్రియపుత్రి అయిన సుకన్యను మహర్షికిచ్చి వివాహం చేశాడు మహర్షి దయవల్ల రాజ సైనికులకు మలమూత్ర నిరోధం తొలగిపోయింది మహారాజు సుకన్యను భర్తసన్నిధిలో విడిచి సపరివారంగా తన పట్టణానికి మరలిపోయాడు

సుకన్య భక్తిభావంలో పతిదేవుడికి పరిచర్యలు చేస్తూ సుఖంగా పర్ణశాలలో నివసిస్తున్నది ఒకనాడు దేవవైద్యులైన అశ్వినీదేవతలు ఇద్దరు చ్యవనమహర్షి ఆశ్రమానికి వచ్చారు గృహస్థ ధర్మం గ్రహించిన సుకన్య అతిథులై వచ్చిన అశ్వినీ దేవతలకు సగౌరవంగా ఆతిథ్యము ఇచ్చింది అశ్వినీ దేవతలు ఆతిథ్యం అందుకొని "బాల నవయౌవనంలో ఉన్న నీవు ఈ పరమ వృద్ధుడైన మహర్షి భార్యవు ఎలా అయినావు సుఖ భోగాలు పొందదగిన వయస్సులో ఈ ముసలి మగనితో ఎలా కాలము గడుపుతున్నావు? అని ప్రశ్నించారు సుకన్యను సుకన్య వారికి తన వృత్తాంతం అంతా వివరించి చెప్పింది వృద్ధుడైనా యువకుడైనా తన భర్త తనకు ఆరాధ్య దేవత అని స్పష్టం చేసింది ఆ మాటలు విని అశ్వినీ దేవతలు పరిహాసము చేస్తూ "బాగున్నది బాగున్నది లోకోత్తరమైన సౌందర్యము అంతా భోగ విముఖుడైన ఆ వృద్ధమహర్షి కోసం వ్యర్థము చేసుకుంటున్నావా?

ఇది నీకు తగినపని కాదు నీ రూపయౌవనాలకు తగిన భర్తను మరొకణ్ణి మేము వెదకి తెస్తాము అతనిని పెండ్లాడి ఆనందముగా కాలం గడుపు" అని పలికారు

సుకన్య అనాదరంగా ఆ మాటలు విని "చాలు చాలు నా మనస్సు తెలియక అక్రమముగా మీరు అధిక ప్రసంగం చేస్తున్నారు నేను పతివ్రతను నాకు పతి తోడదే లోకం మహాత్ముడైన నా భర్త పాదాలే నేను ఎల్లప్పుడూ సేవిస్తాను అయననే నేను ప్రాణ ప్రియముగా ప్రేమిస్తున్నాను ఇక ఆ సంగతి మీరు మాటాడకండి" అంటూ భర్త సన్నిధికి పరుగెత్తి పోయింది సుకన్య

పర్ణశాలలో ధ్యానమగ్నుడై ఉన్న చ్యవన మహర్షి ఆమె సంభ్రమం చూచి కళ్ళు తెరిచాడు సుకన్య కన్నీరు నింపుతూ అశ్వినీ దేవతలు తనతో చేసిన సంభాషణ అంతా భర్తకు చెప్పింది చ్యవనమహర్షి ఆమె పాతివ్రత్యానికి ఆనందపరవశు డయినాడు ఆయిన వెంటనే "అశ్వినీ దేవతలు చెప్పిన దానిలో అనుచితము ఏమీ లేదు సుకన్యా ! అందుకు నేను అనుమతిస్తున్నాను నీవు నిస్సందే హంగా వాళ్ళ మాట అంగీకరించు నవయౌవను డయిన పతిని ఇమ్మని వారిని ప్రార్థించు నీకు శుభం అవుతుంది వెళ్ళు అని పలి కాడు సుకన్య భర్త అనుమతి శిరసావహించింది

అశ్వినీ దేవతలు ఆ పతివ్రతను అనుగ్రహించుట కోసము చ్యవనమహర్షితో పాటు పర్ణశాల మందున్న 'పయోష్టి' సర స్సులో ప్రవేశించారు సుకన్య కన్నార్పకుండా చూస్తూ నిలబడి ఉన్నది అంతలోనే ఆ సరస్సులో మునిగిన ముగ్గురూ పరమ సుందరులైన ముగ్గురు యువకులుగా మారి బయటకు వచ్చారు ఆ మహాద్భుతము చూచి నివ్వెరపడి ఉన్న సుకన్యతో "ఆశ్చర్యపడకు



రాకుమారీ ! మాముగ్గురిలో నీకు నచ్చిన వరుణ్ణి కోరుకో" అని పలికారు ముగ్గురు యువకులూ సుకన్య ఆ ముగ్గురిలోనూ తన భర్త ఎవరా అని ఒక్క క్షణము ఆలోచించింది తన పాతివ్రత్య ప్రభావము వల్ల ఆమె తన భర్తనే తాను కోరుకొన్నది యౌవనవంతుడయిన చ్యవనమహర్షి భార్య వివేకానికి పరమానంద భరితుడయినాడు ఆయన తనకు ఆ విధంగా వార్ధక్యం పోగొట్టి నవయవ్వనము ప్రసాదించినందుకు అశ్వినీదేవతలను ప్రశంసించాడు ఆనందముగా 'అశ్వినీ

లారా! మీరు మాకు మహోపకారం చేశారు నవయౌవనం ప్రసాదించారు సుఖజీవనం అనుగ్రహించారు మీకు తగిన ప్రత్యుపకారం మేము చేయదలచాము మీకు ఇంతకాలంనుంచి యజ్ఞసమయాలలో సోమపానం చేసే అధికారం లేకుండా చేశాడు దేవేంద్రుడు దేవతలతో పాటు దేవవైద్యులైన మీకు కూడా ఆ అధికారం ఉండటము అన్ని విధాలా న్యాయం అందువల్ల ఇక నుంచి మీకు సోమపానము చేసే అర్హత కల్పించాలని మా అభిప్రాయము" అని పలికాడు చ్యవన మహర్షి అశ్వినీ దేవతలు ఆనంద పులకితులై అతని సెలవు తీసుకొని వెళ్ళిపోయారు.

చ్యవన మహర్షి వృద్ధత్వం విడచి యౌవనవంతుడైన వార్త విన్నాడు శర్యాతిమహారాజు ఆయన విస్మయపడుతూ సుఖభోగులై ఉన్న కూతురినీ అల్లుడినీ చూచి పోవాలని వచ్చాడు చ్యవన మహర్షి సాదరంగా శర్యాతి మహారాజును సత్కరించాడు "మహారాజా! మాకు యౌవనము ఇచ్చిన అశ్వినీదేవతల ప్రీతికోసం మేము నీచేత ఒక మహాయజ్ఞం చేయించ దలచాము అందుకు కావలసిన సర్వ సంభారాలూ నీవు సిద్ధం చేయించాలి" అని అతనిని కోరాడు చ్యవన మహర్షి

శర్యాతి మహారాజు అందుకు వెంటనే ఆమోదించాడు అన్ని సంభారాలు సిద్ధం చేయించాడు చ్యవనమహర్షి శర్యాతి చేత విధ్యుక్తంగా మహాయజ్ఞం చేయించాడు ఆ యజ్ఞంలో ఆయన అందరి దేవతలతో పాటు అశ్వినీ దేవతలను కూడా ఆహ్వానించాడు వారికి కూడా సోమరసం సమర్పించాడు అది చూచి దేవేంద్రుడు ఆగ్రహపడుతూ "మహర్షి! ఈ అశ్వినులకు సోమపానం చేసే అర్హత లేదు నీవు అక్రమంగా వారికి సోమరసం ఇచ్చి మమ్మల్ని అవమానించావు అందుకు నిన్ను శిక్షించాలి" అని విజృంభించి చ్యవన

మహర్షిమీద వజ్రాయుధం ఎత్తాడు చ్యవనమహర్షి తపఃప్రభావం వల్ల వజ్రాయుధం ఎత్తిన ఇంద్రునిహస్తం అలాగే స్తంభించిపోయింది దేవేంద్రుడు శక్తిహీనుడైపోయాడు మహర్షి ఆగ్రహావేశంతో యజ్ఞాన్ని కుంజనుంచి ఒక మహారాక్షసుణ్ణి సృష్టించి, దేవేంద్రుణ్ణి శిక్షించి రమ్మని ఆజ్ఞాపించాడు మదోన్మత్తుడైన ఆ మహారాక్షసుడు లోక భీకరంగా గర్జిస్తూ దేవేంద్రుడి మీదకు నడిచాడు

దేవరాజు భయకంపితుడై చ్యవనమహర్షికి చేతులు మోడ్చి "మునీంద్రా! నా అపచారం మన్నించు నన్ను క్షమించు ఈ రాక్షసుణ్ణి ఉపసంహరించు నీ తపశ్శక్తి ముందు నేనెంత? నా వజ్రాయుధం ఎంత? నీ మహాత్మ్యం ఎరుగక నిన్ను ధిక్కరించాను నా అపచారం మన్నించు ఇంతవరకు పంక్తి బాహ్యులై ఉన్న ఈ అశ్వనీదేవతలు నేటినుండి నీవు తలచినట్లే సోమపానానికి అర్హులౌతారు ఇక నా మీద దయవుంచి నా బహుస్తంభనం తొలగించు" అని దీనంగా ప్రార్థించాడు తపోబలం ముందు దేవబలం తల వంచింది

చ్యవన మహర్షి దేవేంద్రుని ప్రార్థన మన్నించాడు అతని బహుస్తంభనం తొలదించాడు రాక్షసుణ్ణి దూరంగా పంపించాడు శర్యాతి యజ్ఞం చక్కగా సమాప్తం అయింది చ్యవన మహర్షి సుకన్యతోపాటు సంతోషంగా యజ్ఞశాలనుండి పర్ణశాలకు బయలు దేరి వెళ్ళాడు

5]

# భీష్మ ప్రతిజ్ఞ

"ఎలా ఉన్నారు మహారాజు ?" ద్వారపాలకుణ్ణి ప్రశ్నించాడు యువరాజు "ఏకాంతమందిరంలో చింతాక్రాంతులై అలాగే పడి ఉన్నారు ప్రభూ" అని సమాధానం చెప్పాడు ద్వారపాలకుడు

'మహారాజు ఈరోజు కూడా ఎవ్వరికి దర్శనం ఇవ్వలేదా?" మళ్ళీ అడిగాడు యువరాజు దేవవ్రతుడు

"లేదు ప్రభూ ! అమాత్యులను గానీ ఉద్యోగులను గాని ఎవ్వరిని తన దగ్గరకు రానివ్వద్దని మహారాజుల ఆజ్ఞ" అని పలికాడు ద్వారపాలకుడు 'అయితే మేము వారిని అవశ్యం దర్శించాలి' అని మహరాజు మందిరంలో ప్రవేశించాడు యువరాజు దేవవ్రతుడు

హస్తినాపుర ప్రభువు శంతనుడు వేట నుంచి తిరిగి వచ్చిన నాటినుంచి ఎవ్వరితోనూ మాట్లాడటం లేదు అన్నపానాలు గ్రహించటంలేదు అంతులేని ఆవేదనతో ఏకాంత మందిరంలో ఆలోచనా మగ్నుడై పరుండి ఉన్నాడు మహారాజు మంత్రులూ ఉద్యోగులూ చాకరులూ పురజనులూ ఎవ్వరూ తనను దర్శింప రాదని ఆజ్ఞాపించాడు ఎవ్వరికి తెలియని ఏదో మనోవ్యథ ఆయనను పట్టి పీడిస్తున్నది తండ్రిగారి దైన్యస్థితి గ్రహించాడు యువరాజు అతడు తండ్రి పరిస్థితిని పరిశీలించటం కోసం రాజమందిరానికి విచ్చేశాడు

శంతనుమహారాజు నాలుగురోజుల క్రిందట యమునా తీరానికి వేటకు వెళ్ళాడు. అక్కడ అతనికి దేవకన్య వంటి కన్యారత్నం కనుపించింది ఆమె అందచందాలు చూచి ముగ్ధుడై పోయాడు మహారాజు ఆయన హృదయంలో ప్రేమభావం చిగురెత్తింది ఆయన మెల్లగా పడవ నడుపుతున్న ఆకన్య దగ్గరకు వెళ్ళి "సుందరీ ! నీ వెవ్వతవు ?

ఇక్కడ ఒంటరిగా ఈ యమునానదిలో పడవ నడిపే పని నీ కెందుకు కలిగింది?" అని అడిగాడు అందుకు ఆమె చిరునవ్వు నవ్వుతూ "నేను దాశరాజు కు తురిని నా పేరు సత్యవతి మా తండ్రిగారి ఆజ్ఞానుసారం ఈ పడవ నడుపుతూ వచ్చిన వాళ్ళను ఉచితంగా ఏరు దాటిస్తూ ఉంటాను" అని మహారాజుకు సమాధానం చెప్పింది

శంతను మహారాజు ఆ మాటలు విని మరింత ముచ్చట పడ్డాడు ఆయన ఆమె అద్భుత సౌందర్యాన్ని గూర్చి అంతకు ముందే కొంతవరకు విని ఉన్నాడు ఇప్పుడు పరమ సుందరి అయిన ఆమెను ప్రత్యక్షంగా చూశాడు ఆయన ఆమెను పెండ్లాడాలని నిశ్చయించుకొన్నాడు అందుకోసం వెను వెంటనే దాశరాజు దగ్గరకు ప్రయాణమై వెళ్లాడు శంతను మహారాజు దాశరాజు కన్యను కోరి వచ్చిన శంతను మహారాజును భక్తి పూర్వకంగా పూజించాడు సగౌరవంగా సత్కరించాడు ఆయన కోరిక విని ఆనందించాడు "మహారాజా! మీవంటి మహా ప్రభువులు కన్యను కోరి రావటం నా మహాభాగ్యం అన్నివిధాల యోగ్యుడయిన వరుడికి పిల్ల నిచ్చి పెళ్ళి చేయటం కంటె కన్నతండ్రికి కావలసింది ఏమీలేదు కాని నామనసులో ఉన్నమాట ఒకటి మీకు మనవి చేసుకుంటాను నా కుమార్తె అయిన సత్యవతిని ధర్మపత్నిగా స్వీకరింపదలిస్తే మీరునాకు ఒక్క వాగ్దానం చెయ్యాలి ఆమెకు పుట్టిన బిడ్డడే మీ తరువాత మీ రాజ్యానికి రాజు కావాలి అందుకు మీరు అంగీకరిస్తే ఆమెను మీ కిచ్చి వివాహం చేస్తాను" అని పలికాడు దాశరాజు

అతని కోరిక వినగానే శంతను మహారాజు ముఖం వెల వెల బోయింది తన తరువాత రాజు కావలసినవాడు తన పెద్ద కొడుకు దేవవ్రతుడు తాను అప్పటికె దేవవ్రతుణ్ణి యువరాజుగా అభిషేకించి

ఉన్నాడు అందువల్ల తన తర్వాత సామ్రాజ్యానికి దేవవ్రతుడే సార్వ భౌముడు కావాలి అదీగాక ఆ దేవవ్రతుడు సామాన్యుడు కాడు వసిష్ఠమహర్షి సమక్షంలో అన్ని వేదాలూ అభ్యసించినవాడు సర్వ ధర్మాలు గ్రహించినవాడు సర్వశాస్త్రాలూ అధ్యయనం చేసినవాడు శస్త్రాస్త్ర పాండిత్యము సంపాదించినవాడు ఆత్మవిజ్ఞానం ఆర్జించు కొన్న వాడు అటువంటి ఉత్తమ పుత్రుణ్ణి కాదని తనరాజ్యం అంతా ఈ సత్యవతికి పుట్టబోయే పుత్రుడికి కట్టబెట్టడం ఎలాగా? పితృభక్తు డయిన దేవవ్రతుడికి తన అన్యాయం చేయలేదు అందువల్ల శంతనుమహారాజు దాశరాజు కోరిక అంగీకరించలేదు దాశరాజు పట్టినపట్టు విడవలేదు శంతను మహారాజు విఫలమనోరథుడై నగరానికి తిరిగి వచ్చాడు అనాటినుంచి అయన సత్యవతిమీద మమకారంతో రాజకార్యాలు విడచి ఏకాంత మందిరంలో మనోవ్యథతో క్రుంగి పోతున్నాడు మాటిమాటికి నిట్టూరుస్తూ నీరసంగా నిస్సహాయంగా దిక్కులు చూస్తూ శయ్యాగతుడై ఉన్నాడు శంతను మహారాజు

యువరాజు దేవవ్రతుడు మహారాజును సమీపించాడు మహా రాజు కుమారునివైపు ఒక్క మాటు కన్నెత్తి చూశాడు మళ్ళీ కన్నులు మూసుకొని మౌనంగా పడుకొన్నాడు దేవవ్రతుడు తండ్రి ప్రక్కన కూర్చున్నాడు "మహారాజా! మహారాజా!" భక్తి పూర్వకంగా తండ్రిని పిలిచాడు దేవవ్రతుడు రాజు శయ్యమీద లేచి కూర్చున్నాడు

"మహారాజా! మీ పరిస్థితి మాకు చాలా మనస్సంతాపం కలిగిస్తున్నది మీ మనోవ్యథకు కారణం ఏమిటో మాకు తెలియటం లేదు అసమానమైన బాహుబలంతో అద్భుతమైన ప్రతిభా బలంతో సామ్రాజ్యం అంతా నిత్య కళ్యాణం పచ్చతోరణంగా పరిపాలిస్తు

ఇక్కడ ఒంటరిగా ఈ యమునానదిలో పడవ నడిపే పని నీ కెందుకు కలిగింది?" అని అడిగాడు అందుకు ఆమె చిరునవ్వు నవ్వుతూ "నేను దాశరాజు కూతురిని నా పేరు సత్యవతి మా తండ్రిగారి ఆజ్ఞానుసారం ఈ పడవ నడుపుతూ వచ్చిన వాళ్ళను ఉచితంగా ఏరు దాటిస్తూ ఉంటాను" అని మహారాజుకు సమాధానం చెప్పింది

శంతను మహారాజు ఆ మాటలు విని మరింత ముచ్చట పడ్డాడు ఆయన ఆమె అద్భుత సౌందర్యాన్ని గూర్చి అంతకు ముందె కొంతవరకు విని ఉన్నాడు ఇప్పుడు పరమ సుందరి అయిన ఆమెను ప్రత్యక్షంగా చూశాడు ఆయన ఆమెను పెండ్లాడాలని నిశ్చయించుకొన్నాడు అందుకోసం వెను వెంటనే దాశరాజు దగ్గరకు ప్రయాణమై వెళ్ళాడు శంతను మహారాజు దాశరాజు కన్యను కోరి వచ్చిన శంతను మహారాజును భక్తి పూర్వకంగా పూజించాడు సగౌరవంగా సత్కరించాడు ఆయన కోరిక విని ఆనందించాడు "మహారాజా ! మీవంటి మహా ప్రభువులు కన్యను కోరి రావటం నా మహాభాగ్యం అన్నివిధాల యోగ్యుడయిన వరుడికి పిల్లనిచ్చి పెళ్ళి చేయటం కంటె కన్నతండ్రికి కావలసింది ఏమీలేదు కాని నామనసులో ఉన్నమాట ఒకటి మీకు మనవి చేసుకుంటాను నా కుమార్తె అయిన సత్యవతిని ధర్మపత్నిగా స్వీకరింపదలిస్తే మీరునాకు ఒక్క వాగ్దానం చెయ్యాలి ఆమెకు పుట్టిన బిడ్డడే మీ తరువాత మీ రాజ్యానికి రాజు కావాలి అందుకు మీరు అంగీకరిస్తే ఆమెను మీకిచ్చి వివాహం చేస్తాను" అని పలికాడు దాశరాజు

అతని కోరిక వినగానే శంతను మహారాజు ముఖం వెల వెల బోయింది తన తరువాత రాజు కావలసినవాడు తన పెద్ద కొడుకు దేవవ్రతుడు తాను అప్పటికె దేవవ్రతుణ్ణి యువరాజుగా అభిషేకించి

ఉన్నాడు అందువల్ల తన తర్వాత సామ్రాజ్యానికి దేవవ్రతుడే సార్వభౌముడు కావాలి అదీగాక ఆ దేవవ్రతుడు సామాన్యుడు కాడు వసిష్ఠమహర్షి సమక్షంలో అన్ని వేదాలూ అభ్యసించినవాడు సర్వధర్మాలు గ్రహించినవాడు సర్వశాస్త్రాలూ అధ్యయనం చేసినవాడు శస్త్రాస్త్ర పాండిత్యము సంపాదించినవాడు ఆత్మవిజ్ఞానం ఆర్జించుకొన్న వాడు ఆటువంటి ఉత్తమ పుత్రుణ్ణి కాదని తనరాజ్యం అంతా ఈ సత్యవతికి పుట్టబోయే పుత్రుడికి కట్టబెట్టడం ఎలాగా? పితృభక్తుడయిన దేవవ్రతుడికి తన అన్యాయం చేయలేడు అందువల్ల శంతనుమహారాజు దాశరాజు కోరిక అంగీకరించలేదు దాశరాజు పట్టినపట్టు విడవలేదు శంతను మహారాజు విఫలమనోరథుడై నగరానికి తిరిగి వచ్చాడు అనాటినుంచి అయన సత్యవతిమీద మమకారంతో రాజకార్యాలు విడచి ఏకాంత మందిరంలో మనోవ్యధతో క్రుగ్గిపోతున్నాడు మాటిమాటికి నిట్టూరుస్తూ నీరసంగా నిస్సహాయంగా దిక్కులు చూస్తూ శయ్యాగతుడై ఉన్నాడు శంతను మహారాజు

యువరాజు దేవవ్రతుడు మహారాజును సమీపించాడు మహారాజు కుమారువైపు ఒక్క మాటు కన్నెత్తి చూశాడు మళ్ళీ కన్నులు మూసుకొని మౌనంగా పడుకొన్నాడు దేవవ్రతుడు తండ్రి ప్రక్కన కూర్చున్నాడు "మహారాజా! మహారాజా!" భక్తిపూర్వకంగా తండ్రిని పిలిచాడు దేవవ్రతుడు రాజు శయ్యమీద లేచి కూర్చున్నాడు

"మహారాజా! మీ పరిస్థితి మాకు చాలా మనస్సంతాపం కలిగిస్తున్నది మీ మనోవ్యధకు కారణం ఏమిటో మాకు తెలియటం లేదు అసమానమైన బాహుబలంతో అద్భుతమైన ప్రతిభా బలంతో సామ్రాజ్యం అంతా నిత్య కళ్యాణం పచ్చతోరణంగా పరిపాలిస్తు

న్నారు మీ ! దేశం మిమ్మల్ని ధిక్కరించే శత్రువులు లేరు ! మీకు విధేయులుకాని రాజులు లేరు ! ప్రజలందరూ సర్వసౌభాగ్యాలతో సంతోషంగా సుఖజీవనం చేస్తున్నారు మరి మీకు ఈ విధంగా మనస్తాపం కలగడానికి కారణం ఏమిటో అర్థం కావటంలేదు మీ మనస్సులో మాట చెప్పండి మీకు సంతోషం కలిగించే మహా భాగ్యం నాకు ప్రసాదించండి" అని తండ్రిని ప్రార్థించాడు దేవవ్రతుడు

శంతను మహారాజు కొంచముసేపు ఏమేమో ఆలోచించాడు ఎలాగో గొంతు పెకలించుకొని కుమారుని వెన్నుతట్టి దేవవ్రత ! లోకంలో ఒక్కడే పుత్రుడు ఉన్నవాడు సంతానహీనుడితో సమానం అని పెద్దలంటారు అందువల్ల నీకు తోడుగా మరికొందరుపుత్రులు కావాలని మేము కోరుతున్నాం" అని పలికాడు మహారాజు

దేవవ్రతుడు ఆలోచనామగ్నుడైనాడు "తన తల్లి అయిన గంగాదేవి తాను జన్మించగానే తండ్రినివిడచి వెళ్ళిపోయింది ఇప్పుడు తండ్రిగారికి మళ్ళీ సంతానం కావాలంటే ఆయనకు తగిన కన్యను తెచ్చి వివాహం చెయ్యాలి అదెలాగా?" అని ఆలోచనచేశాడు దేవవ్రతుడు అతడు ఎలాగైన సరే తండ్రి అభీష్టం సఫలం చెయ్యాలని నిశ్చయించుకొన్నాడు వెంటనే అతడు తండ్రిని అడిగి ఆయన వలచిన కన్యనుగూర్చి వివరాలన్నీ తెలుసుకొన్నాడు తండ్రిగారికి ధైర్యం చెప్పి సపరివారంగా దాశరాజు దగ్గరకు బయలుదేరాడు దేవవ్రతుడు

దేవవ్రతుడు దాశరాజు సన్నిధికి చేరుకొన్నాడు ఆదరంగా ఆతడిచ్చిన స్వాగత సత్కారాలు అందుకొన్నాడు తన తండ్రి అయిన శంతను మహారాజుకు సత్యవతిని ఇచ్చి వివాహం చేయవలసిందని దాశరాజును అభ్యర్థించాడు దేవవ్రతుడు ఆతని ప్రార్థన

విని దాశరాజు యువరాజా! కన్యార్థివై నీవు నా వద్దకు రావటం చాలా సంతోషకరముగా ఉన్నది నీవు ధర్మవేత్తవు కార్యదక్షుడవు మీతండ్రి కోరిక తీర్చటకోసము నీవు నా దగ్గరకు వచ్చావు నేను కృతార్థుణ్ణి అయినాను మీతోడి వియ్యముకంటె నాకు కావలసింది లేదు అయితే నాది ఒక్క మనవి ఈ సత్యవతి 'ఉపరిచరుడు అనే రాజర్షి కుమార్తె ఆయన ఈ బిడ్డను నాకు అప్పగిస్తూ ఈమెను శంతను మహారాజుకే ఇచ్చి వివాహము చేయాలని ఆదేశించాడు అందువల్లనే ఇంతకాలము ఇతరు లెవ్వరికీ ఈమెను ఇవ్వటానికి నేను అంగీకరించలేదు ఇప్పుడు మీరు కోరినట్లు శంతను మహారాజుకు ఈమె నివ్వటానికి అభ్యంతరము ఏమీలేదు కాని అందుకు నీవల్లనే ఒక ఆటంకము వచ్చింది అని పలికాడు

దేవవ్రతుడు ఆశ్చర్యపడుతూ అందుకు నావల్ల ఆటంకము వచ్చిందా అదేమిటి దాశరాజా" అని అడిగాడు "అదే మనవి చేస్తాను యువరాజా! మీతండ్రి తరువాత ఈ కన్యకు పుట్టిన కుమారుడే మీ రాజ్యానికి రాజు కావాలని మా కోరిక సర్వసమర్థుడవైన నీవు ఉండగా మా కోరిక తీరటము అసంభవము కదా" అన్నాడు దాశరాజు

దేవవ్రతుడు గంభీరముగా ఆ సందేహము మీకు అవసరము లేదు దాశరాజా! పంచభూతాల సాక్షిగా, ఇక్కడ సమకూడి ఉన్న ప్రజానీకము సాక్షిగా ఒక మహా ప్రతిజ్ఞ చేస్తున్నాను మా తండ్రిగారి తర్వాత ఈ సత్యవతికి పుట్టిన కుమారుడే మా హస్తినాపురానికి అధిపతి అవుతాడు వాడే మా వంశకర్త అవుతాడు వాడే మాకు సార్వభౌముడవుతాడు అందుకు అనుకూలముగా నేను నా రాజ్యాధికారము శాశ్వతముగా వదలుకొంటున్నాను అని మహా ప్రతిజ్ఞ చేశాడు



ఆ భీషణ ప్రతిజ్ఞ వినగానే సభులందరూ స్తబ్ధులైపోయార
దాశరాజు ఆశ్చర్య పులకితుడైనాడు 'యువరాజు ! నీవు మహో
దారుడవు లోకోత్తరమైన పితృభక్తి పారవశ్యంతో శాశ్వతంగా
నీ రాజ్యాధికారాన్ని పరిత్యజించావు అయినా మాకు మరొక్క
సందేహం ఉన్నది ఇకముందు నీకు పుట్టే కుమారుడు నీలాగే
రాజ్యాధిపత్యం వదులుకుంటాడని నమ్మకం ఏమున్నది న్యాయ
శాస్త్రం ప్రకారం నీవు వదులుకున్న నీ కుమారుడికి రాజ్యాధికారం
తప్పకుండా సంక్రమిస్తుందిగదా అప్పుడు మరి మా సత్యవతి
కొడుకు రాజు ఎలా అవుతాడు ? ఆ సంగతికూడా ఆలోచించాలి"
అన్నాడు దాశరాజు

దేవవ్రతుడు నిశ్చలంగా "ఆ సందేహం కూడా మీకు అవసరంలేదు దాశరాజా! మా తండ్రిగారి కోరిక తీర్చటం కోసం నేను జీవితాంతం బ్రహ్మచర్యవ్రతం అవలంబిస్తాను శాశ్వతంగా అవివాహితుణ్ణి అయి ఉంటాను ఆజన్మ బ్రహ్మచారినై నా శక్తిసామర్థ్యాలన్నీ మా వంశ రక్షణకోసం వినియోగిస్తాను" అని అందరి సమక్షంలో భీష్మప్రతిజ్ఞ చేశాడు తండ్రి కోరిక తీర్చటం కోసం రాజ్యత్యాగంచేసి శాశ్వత బ్రహ్మచర్యాల స్వీకరించిన దేవవ్రతుడి మహాప్రతిజ్ఞ విని సభ అంతా జయజయారావాలు చేసింది దివ్యలోకంనుంచి దేవత లందరూ యువరాజుమీద పుష్పవర్షం కురిపిస్తూ "భీష్ముడు భీష్ముడు అని పరమానందంగా ప్రశంసించారు తన అభీష్టం సఫలమైనందుకు ఆనందపరవశుడై నాడు దాశరాజు తల్లి అయిన సత్యవతిని స్వర్ణ రథం మీద కూర్చుండబెట్టుకొని తండ్రిగారి సన్నిధికి తరలిపోయాడు భీష్ముడు

# బంగారు ముంగిస

'అసత్యం ! అసత్యం ! ముమ్మాటికి అసత్యం ! ధర్మరాజు చేసిన ఈ అశ్వమేధయాగము ప్రపంచములో అన్ని యాగాలకంటె గొప్పదనటం అక్షరాల అసత్యం పుణ్యాత్ముడైన సక్తుప్రస్తుడి దాన మహాత్మ్యము ముందు ఈ యాగ మహాత్మ్యము ఎందుకూ పనికిరాదు" అంటూ ప్రక్కన ఉన్న బిలంలోనుంచి అక్కడకు వచ్చింది బ గారు ముంగిస

ధర్మరాజు చేసిన అశ్వమేధయాగాన్ని అనేక విధాలుగా ప్రశంసిస్తున్న సభాసదులందరూ స్తబ్ధులైపోయారు సభలో ఉన్న పండితులూ బంధువులూ మంత్రులూ సామంతులూ, పౌరులూ, పురజనులూ అందరూ ఆశ్చర్యపరవశులై బంగారు ముంగిసవైపు అలాగే చూడసాగారు ఆ విభ్రమంలో నుంచి కొంచముసేపటికి తెప్పరిల్లి ఒక బ్రాహ్మణవర్యుడు బంగారు ముంగిసను ప్రశ్నించాడు "ఏమన్నావు ధర్మరాజుల వారి యాగము కంటె సక్తుప్రస్తుడి దానం గొప్పదా ? నీకు మతిభ్రమణము కలుగలేదుగదా సర్వసద్గుణ సంపన్నుడైన ఈ సార్వభౌముడు ప్రపంచము అంతా జయించాడు కోట్లకొలది బ్రాహ్మణులకు సంతుష్టిగా అన్నదానము చేశాడు సర్వప్రజలనూ దానధర్మాలతో అపూర్వమైన అశ్వమేధ మహాయాగము సక్రమంగా నిర్వహించాడు దేవతలకూ మునులకూ పరమానందము కలిగించాడు ఈ మహాయజ్ఞాన్ని లోకము అంతా అభినందించింది ఇటువంటి అశ్వమేధయాగము భూలోకంలో అన్నిటకంటె గొప్ప దనటం అసత్యమంటావా ? అతడెవరో ఆ సక్తుప్రస్తుడిదానము ముందు ఈ ధర్మరాజు మహాయాగము పనికిమాలిన దంటావా ? అన్నాడు బ్రాహ్మ

ణుడు బంగారు ముంగిస తల ఊపుతూ "అవును అంనే నిశ్చయంగా అంతే ఆ సక్తుప్రస్థుడి త్యాగం ముందు ఈ ధర్మరాజు యాగం తీసి కట్టు" అని పలికింది "అదెలాగో వివరంగా చెప్పు" అన్నాడు బ్రాహ్మణ వర్యుడు బంగారు ముంగిస చెప్పటం ప్రారంభించింది

వినండి సభాసదులారా ! ఆ కథ అంతా వివరంగా వినిపిస్తా ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో 'సక్తుప్రస్థుడు అనే పేద బ్రాహ్మణుడు ఉండేవాడు అతడూ అతని భార్యా కుమారుడూ కోడలు నలుగురూ అక్కడక్కడ నివ్వరి ధాన్యం ప్రోగుచేసి తెచ్చుకొంటూ దొరికినదానితో తృప్తిపడుతూ కాలం గడుపుతూ ఉండేవారు ఒక సారి అనావృష్టివల్ల దేశంలో పంటలన్నీ పాడయి పోయినవి ఒక్క పూట కూడా తిండి గడవటం కష్టమైపోయింది ఎంత ప్రయత్నించినా పిడికెడు ధాన్యం కూడా దొరకటం లేదు ఆ బ్రాహ్మణ కుటుంబం ఆకలితో అల్లాడిపోతున్నది వాళ్ళు పొలాలలో అక్కడక్కడా నేల రాలిన ధాన్యం గింజలు ఏరి తెచ్చుకొని కడుపు మంట చల్లార్చుకుంటూ ఎలాగో కాలం గడుపుతున్నారు ఒకనాడు వాళ్ళు నలుగురూ పొలాల మీదకు వెళ్ళి కొంచెం ధాన్యం ఏరి తెచ్చుకొన్నారు ఆ ధాన్యం గింజలు పేలాలు వేయించుకొన్నారు ఆ పేలాలు పిండి కొట్టి నలుగురూ నాలుగు గుప్పెళ్ళు పంచుకొన్నారు ఆకులలో ఉంచుకొని ఎవరి సక్తు వారు తినబోతున్నారు

అంతలోనే వారి ఇంటిముందు "ఆకలి ఆకలి" అంటూ ఒక అతిథి వచ్చి నిలబడ్డాడు వెంటనే సక్తుప్రస్థుడు అతిథి దేవుడికి ఎదురు వెళ్ళి భక్తి పూర్వకంగా స్వాగతం చెప్పి లోపలికి తీసుకొనివచ్చాడు అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి దర్భాసనం మీద కూర్చుండబెట్టి తాను తినబోతున్న పేలపిండి అతిథి ముందు పెట్టాడు 'స్వామీ, దయచేసి ఈ పేదవాని అతిథ్యం అంగీకరించు ఈ పేలపిండి ఆరగించు" అని

అతిథిని వేడుకొన్నాడు సక్తుప్రస్థుడు  అతిథి సక్తుప్రస్థుడు పెట్టిన పేల పిండి అంతా ఒక్కమాటుగా అందుకొని భుజించాడు కాని అతని ఆకలిబాధ ఏమీ తగ్గలేదు  అతడు మళ్ళీ ఆశగా సక్తుప్రస్థుడి వైపు చూశాడు

సక్తుప్రస్థుడు అతిథి ముఖం చూచి అతని అసంతృప్తి గ్రహించాడు "ఆకలి గొన్న అతిథిని సంతుష్టి పరచలేక పోయానే" అని చింతపడ సాగాడు సక్తుప్రస్థుడు  అతని మనస్సు గ్రహించి అతని భార్య తన పాలి పేలపిండి తెచ్చి అతిథిముందు పెట్టింది "ఈ పిండిని కూడా అతిథి దేవుడికి అర్పించండి  సగం ఆకలి తీర్చటం సముచితం గాదు అని ఆమె భర్తను వేడుకొన్నది  తాను ఆకలిగొని ఉండికూడా ఆవిధంగా తన పాలి ఆహారం తెచ్చి అతిథికి అర్పిస్తున్న భార్యను చూచి జాలపడ్డాడు సక్తుప్రస్థుడు అతని మనస్సంతా వికలమై పోయింది అతడు చింత పడుతూ "సాధ్వీమణీ! భార్యను పోషించటం భర్త ధర్మం  నిన్ను పోషించ లేక పోగా కష్టపడి నీవు తెచ్చుకొన్న ఆహారము నేను అపహరించి ఇతరులకు పెట్టటం న్యాయం కాదు  వద్దు వద్దు స్త్రీ సొత్తు అపహరించటం కంటె అకార్యము మరొకటి లోకంలో లేదు  అందువల్ల నీ నోటిదగ్గర అన్నం నేను దానం చెయ్యరాదు" అని పలికాడు

ఆ మాటలు విని సక్తుప్రస్థుడి భార్య భర్త ముఖమువైపు కన్నార్పకుండా చూస్తూ "అలా అనకండి ఆర్యా! భార్యకు భర్తయే తల్లి తండ్రీ గురువూ దైవము  భర్త బాధ్యతలో భాగము పంచుకొనడమే భార్యకు ధర్మం  మీరు మీ ఆహారం అతిథికి ఇచ్చి ఉపవాసం చేస్తూ ఉండగా నేను మాత్రము ఈ పేలపిండితో కడుపు నింపు కుంటానా?  అలా వద్దు  నేను మీతో పాటే నిరాహారంగా

ఉంటాను దయచేసి దీనిని కూడా అతిథి దేవుడికి పెట్టండి ఆయన తృప్తిపడితే దేవుడు తృప్తి పడినట్లె అని పలికింది

సక్తుప్రస్తుడు భార్య వాలి పేలపిండి కూడా అతిథి ముందుగా పెట్టాడు అతిథి ప్రీతి పూర్వకంగా ఆ పిండి కూడా ఆరగించాడు కాని అతని ఆకలి తీరలేదు అతనికి అసంతృప్తి కలుగలేదు అంతలో సక్తుప్రస్తుని కుమారుడు తనవంతు పేలపిండి తండ్రికి చూపి " దీనిని కూడా అతిథి దేవునికే ఆరగింపు చెయ్యండి అసంతృప్తిగా ఆతిథ్యం ఇవ్వటం ధర్మము కాదుగదా అని పలికాడు సక్తుప్రస్తుడు అందుకు ముందు అంగీకరించలేదు " కుమారా ! నీవు చిన్నవాడవు ఎంత వయస్సు వచ్చినా తండ్రి దృష్టిలో బిడ్డ చిన్నవాడే అవుతాడు కన్న బిడ్డని కడుపు నిండకుండా ఆకలి బాధకు పాల్పడ చెయ్యటము తండ్రి అయిన వాడికి ధర్మం కాదు " అని సక్తుప్రస్తుడు కుమారుణ్ణి వారించాడు కాని అతని కుమారుడు " అలా అనకండి తండ్రి మీరు తలపెట్టిన పని సక్రమముగా నిర్వహించటము నా బాధ్యత అతిథి పూజలో మీతో పాటు నన్ను కూడా పాలు పంచుకోనివ్వండి " అని ప్రార్థించాడు సక్తుప్రస్తుడు మారు మాటాడ లేక కుమారుని భాగం పేలపిండి కూడా అతిథి దేవుడికి అర్పించాడు అతిథి ఆ పిండికూడా ఆరగించాడు అయినా అతని ఆకలి తీరునట్టుగా తోచలేదు సక్తుప్రస్తుడికి అతిథి పూజ సక్రమంగా నెరవేరనందుకు ఆవేదన పడసాగాడు సక్తుప్రస్తుడు

మామగారి మనోవేదన చూచి అతని కోడలు ముందుకు వచ్చింది తన భాగం గూడా అతిథికోసం వినియోగించమని మామ గారికి తన ఆకు అందించింది సక్తుప్రస్తుడు " వద్దు తల్లి వద్దు నీవు ఈ యింటి కోడలివి నీకు సరిగా అన్న వస్త్రాలు సమకూర్చవలసిన వాణ్ణి నేను అలా చేయకపోగా ఆకలి బాధతో అలమటిస్తున్న

నీవాలి పేలపిండికూడా అతిథికోసం వినియోగించటం నాకు ఇష్టం లేదు అన్నాడు కోడలు వింటుండగా "విచారించకండి భర్త మార్గాన్ని భార్య అనుసరించటం అధర్మం కాదు నా భర్త తన ఆహారం అతిథి దేవులకు అర్పించారు వారి మార్గంలోనే నన్నూ నడవనివ్వండి వారి సహధర్మచారిణిగానే నన్ను వర్తింపనివ్వండి" అని కోరింది సక్తుప్రసుడు కోడలివాలి పేలపిండికూడా అతిథిదేవుని ముందు పెట్టాడు అతిథి ఆ పేలపిండి అందుకొని ఆనందంగా ఆరగించాడు అతని ఆకలి చల్లారింది అతని ముఖం వికసించింది అతనికి పరిపూర్ణంగా సంతుష్టి



కలిగింది అతిథిదేవుడు ధర్మదేవతగా మారి బ్రాహ్మణ కుటుంబం ముందు ప్రత్యక్షమైనాడు

సక్తుప్రస్థా నీ అతిథి సేవనూ నీ ధర్మబుద్ధినీ పరీక్షించటంకోసమే నేను ఇలా వచ్చాను నేను ధర్మదేవతను నీ దాన నిరతికి, నీ ధర్మ దీక్షకూ నేను చాలా మెచ్చుకొంటున్నాను నీభక్తి వినయాలకు నేను చాలా ఆనందించాను నీ శ్రద్ధాసక్తికీ నీ సహనశక్తికీ నేను చాలా సంతోషించాను పుణ్యమూర్తివైన నీవూ అనుకూలవతిఅయిన నీ అర్ధాంగి యోగ్యుడయిన నీ కుమారుడూ, పతివ్రత ఆయిన నీ కోడలూ అందరూ ధర్మాత్ములే అందరూ ఆదర్శమూర్తులే అదిగో మీ దాన మహాత్మ్యానికి దేవతలందరూ మెచ్చుకొంటున్నారు" అని పలికాడు ధర్మదేవత మరుక్షణంలోనే ఆ బ్రాహ్మణకుటుంబంమీాద ఆకాశంనుంచి పుష్పవర్షం కురిసింది దేవదుందుభులు మ్రోగినవి

ధర్మదేవత ఆనంద పరవశుడై చేతులు మోడ్చి నిలిచిన సక్తుప్రస్థుణ్ణి చూచి "ఆర్యా! అన్ని దానాలకంటె అత్యుత్తమమైనది అన్నదానం అన్ని వ్రతాలకంటె ఉత్తమవ్రతం అతిథి సత్కారం ఆ మహాదానం నీవు చేశావు ఆ ఉత్తమ వ్రతం నీవు కావించావు నీ దాన మహాత్మ్యంవల్ల నీకూ నీకుటుంబానికి పుణ్యలోకం ప్రాప్తిస్తున్నది నిన్ను సందర్శించాలని సప్తర్షులు వేడుక పడుతున్నారు నీ కోసం దివ్యలోకం నుంచి రత్న విమానం దిగివస్తున్నది చూడు" అని దివినుంచి దిగివస్తున్న దేవతా విమానం చూపించాడు ధర్మదేవత సక్తుప్రస్థుడు సకుటుంబంగా ఆ విమానంలో ఎక్కి దేవలోకానికి వెళ్ళిపోయాడు ఈ విశేషమంత నేను ఒక చెట్టుచాటున ఉండి కనులారా దర్శించి తన్మయత్వం చెందాను" అని ఆ ధర్మరాజు సభా మధ్యంలో నిలబడి సక్తుప్రస్థుడి పవిత్ర చరిత్రం సభ్యులందరికి సమగ్రంగా వినిపించింది బంగారు ముంగిస

ఆ కథ విని సభా సదులందరూ ఆశ్చర్యచకితులైనారు బంగారు ముంగిస ఒక్కమాటు తన కుడిప్రక్క చూసుకొన్నది 'అయ్యాలారా! ఆ విధంగా ఆ సక్తుప్రస్థుడు అతిథి దేవుణ్ణి చూపించిన చోటుకు నేను వెళ్ళాను అతడు అతిథి పాదాలు కడిగిన స్థలంలో సంచరించాను అక్కడ ఏర్పడి వున్న బురదలో అక్కడక్కడ పేలపిండి రాలివున్నది అందులో, తలా, ఒళ్ళా తడిసేటట్లు అటూ ఇటూ పొరలాడాను ఆ పుణ్యాత్ముని పూజా మహాత్మ్యం వల్ల నా తల అంతా బంగారు కాంతులతో మిలమిలలాడి పోయింది ఆ పేలపిండి రాలిన నేల సోకినంత వరకు నా దేహం ఒక ప్రక్క అంతా సువర్ణమయం అయిపోయింది ఇదంతా త్యాగబుద్ధితో సమర్పించిన ఆ పేలపిండి మహత్త్యం కాబోలు ఇ విధంగా నా సగం శరీరం బంగారు కాంతులతో ధగధగలాడి పోతు న్నందుకు నాకు మహానందం కలిగింది "నా దేహములో మి లిన భాగంకూడా సువర్ణ మయం అయితే ఎంత చక్కగా ఉంటుందో" అని ఆలోచన కలిగింది నాకు అందుకోసం ఆనాటినుంచి ఈనాటి వరకూ ఎన్ని ఆశ్రమాలకో వెళ్ళాను ఎన్ని పుణ్య ప్రదేశాలో చూశాను ఎన్ని దాన స్థలాలో దర్శించాను ఎన్ని యజ్ఞశాలలో పరి శీలించాను కాని ఎక్కడా అంత మహాత్మ్యం కన్పించలేదు ఎంత కష్ట పడినా ఎంత దూరం తిరిగినా నా రెండవప్రక్క స్వర్ణ మయం కానేలేదు

ఇంతకాలానికి ఈ మహాత్ముడైన ధర్మరాజు అశ్వమేధ యాగం చేస్తున్నాడని విని ఇక్కడ నాకోరిక తప్పక సిద్ధిస్తుందని ఎంతగానో ఆశపడివచ్చాను, కాని ఇక్కడకూడా నాకోరిక తీర లేదు ఈ మహాయాగంలో అన్ని స్థలాలు దర్శించాను దాన జలధారలు పడి తడిసిన బురద నేలలో పొరలడాను ఒంటికి బురద అంటింది కాని బంగారు కాంతి అంటనే లేదు నాఅభీష్టం ఫలించ

లేదు నా దేహంలో ఈ మిగిలిన భాగం సువర్ణమయం కాలేదు అందు వల్లనే ఆ సక్తుప్రస్థుడి దాన మహాత్వం ముందు ఈ ధర్మరాజు అశ్వ మేధ యాగం ఎందుకూ పనికిరాదని నేను అంటున్నాను అవునో కాదో మీరూ ఆలోచించండి అనవసరంగా వట్టి పొగడ్తలు చేయకండి" అంటూ బంగారు ముంగిస తోక త్రిప్పుకుంటూ అక్కడ నుంచి అద్భుతంగా అదృశ్యమై పోయింది ధర్మరాజూ సభాసదులూ విభ్రాంతులై బంగారు ముంగిస వెళ్ళిన వైపే కన్నార్పకుండా చూడ సాగారు

— 0 —